## ★ కామన్ కథలు ★

రచన : డాక్టర్ యన్. వి. కామేశ్వరరావు.

ఆరు చిన్నకథల సంపుటి చక్కని శైలి; హాస్య రసం పుట్టిస్తుంది. అభూతకల్పనా, అతిమధుర శిల్ప నైపుణ్యం, కథానిర్వాహణలో చాకచక్యం వెల్లివిరుస్తున్నవి. ప్రజలుచదివి అనుభూతిపొంది చక్కగా ఆనందించవచ్చు. వెల 0-12-0

## ★ తోడునీడ ★

రచన : డాక్టర్ యన్. వి. కామేశ్వరరావు.

పదిరంగాలుగల వినోదాంత నాటకం. వినోదంతో పాటు జీవితంలోని విషాద సంఘటనలు, వివిధ మనస్తత్వ రూపాలుకూడ చిత్రించబడినవి. ప్రతిపాత్ర శీలం మానసిక ప్రవృత్తి చక్కగా పోషించబడినవి. సంభాషణలు మృదు మధురంగా తెలుగు నుడికారంలో చక్కగా సాగాయి. ఇతి వృత్తంతోపాటు కళానైపుణ్యాం, భావోద్రేకం, పాత్రల త్వరితగమనం చక్కగా వున్నవి.

'తిమ్మఖం' పాత్ర హాస్యాన్ని, వినోదాన్ని సహృ యంతో అందిస్తుంది, మోహనరావులో కాపట్యాం, దార్జన్యం హింసాకాండ మూర్తీభవించినవి. వెల 1-4-0

## ★ ఆత్మగౌరవము ★

రచయిత : పోకల నరసింహారావు.

చిన్న నాటిక. సులభశైలి, పాత్ర ఔచిత్యం వు కథావృత్తంలో అంత బిగువులేదు. నాయికానాయకుల ప ప్రేమ సరళంగానే నడచింది. కామార్థ పిపాసితుడు సుబ్ర హ్మణ్యం, ఆత్మగౌరవం, సంప్రదాయతగల గోపాల్ తానుభవం పొందిన రంగనాథం, వీరి పాత్రలను చక్కగా పోషించారు.

# వైఠిగద్ద

(విషాదభరిత రూపకం)

రచన:

పండిత; కోనేరు కుటుంబరావు



(శ్రీ శే॥ కురుకూరి సుబ్బారావుగారు)


పబ్లిషర్ :

**కురుకూరి సుబ్బారావు సన్,**

ప్రాప్తిస్థానము: సరస్వతీ బుక్ డిపో,

మెయిన్ బజార్ :: విజయవాడ-1.

# తొలిపలుకు

—○—

## ఆ నాడు

కళాజీవనమే మధుర జీవనంగా నా బాల్యంనుండీ నాట్యోపాసనచేసి తత్కళామూర్తికి నా ఋణం కొంత మేరకు తీర్చుకొంటిననే చెప్పవచ్చు. అంతట్లోతృప్తిచెందక నాటకాలు కొన్నికూడ రచించి తెల్గుగడ్డ నలుమూలలా ఆశాజ్యోతి స్వరూపంతో నటరాజు నర్పించాం నేనూ మా కోడూరి అచ్చయ్యగారు చిరంజీవి అక్కినేని నాగేశ్వరరావున్నూ నాట్యసాంప్రదంతో నడిచే మాకనులకే "ఆశాజ్యోతి" తో తెల్గు బాటలను సవరించే వాడు మా "దుక్కిపాటి మధు" పెండ్యాల సంగీతం శ్రీ శ్రీ సూరపనేని ప్రభాకరుని దివ్యగానం-ఆ రోజుల్లో సామాజికుల్ని పరిముగ్ధుల్ని చేస్తూండేవి నిజమైన కళారాధన మంటే "ముదినేపల్లి ఎక్సెల్షియర్ నాట్యమండలి" వారిదే అని తెల్గు దేశమంతా చెప్పుకొనే వారు. ఆనాడే ఆశాజ్యోతి పుట్టువు. విసిగించను "దేహినో దివసాగతాః" అవన్నీ బలవంతంగా మరచిపోవాలి—

## ఈ రోజుల్లో

"పైడిగడ్డ" పుల్కరించింది "పెదపాలపర్రు విజయ భారత నాట్యమండలి" వారు నా పర్యవేక్షణలో ఈ గడ్డలో చక్కగానే కృషిచేశారు. ఫలితంగా అపూర్వఖ్యాతి నార్జించారు కళారాధకుల్ని చుట్టుకొనే సహజకష్టాలకు తట్టుకోలేక ఇప్పుడి

సర్వస్వామ్యములు
ప్రకటనకర్తవి

ప్రథమ కూర్పు 1250
మార్చి 1954

ఈ నాటకమునందువచ్చు పాత్రలు

| పురుషులు | స్త్రీలు |
| --- | --- |
| జగం | విశాలాక్షి |
| రంగయ్య | కరుణ |
| గ్రామానందం | |
| రామయ్య | |
| ఇస్మాయిల్ | |
| నాగయ్య | |
| అచ్చన్న | |
| గంగన్న | |
| క. గం. | |

విజయవాడ:
ప్రథమాంబ ప్రెస్ నందు
ముద్రింపబడియె.

వెల 1—4—0

# తొలిపలుకు

—o—

## ఆనాడు

కళాజీవనమే మధుర జీవనంగా నాబాల్యంనుండి నాట్యోపాసనచేసి తత్కళామూర్తికి నాఋణం కొంత మేరకు తీర్చుకొంటిననే చెప్పవచ్చు. అంతట్తోతృప్తిచెందక యీనాటకాన్నికూడ రచించి తెల్లుగడ్డ నలుమూలలా ఈజ్యోతి స్వరూపంతో నటరాజు నర్పించాం నేనూ మాకోడూరి అచ్చయ్యగారు చిరంజీవి అక్కినేని నాగేశ్వరరావున్నూ నాట్యోన్మాదంతో నడిచే మాకనులకీ "ఆశాజ్యోతి" తోవెల్లు బాటలను సవరించే వాడు మా "దుక్కిపాటి మధు" పెండ్యాల సంగీతం కీ॥ శే॥ సూరపనేని ప్రభాకరుని దివ్యగానం-ఆ రోజుల్లో సామాజికుల్ని పరిముగ్ధుల్ని చేస్తూండేవి నిజమైన కళారాధన మంటే "ముదినేపల్లి ఎక్సెల్షియర్ నాట్యమండలి" వారిదే అని తెల్గు దేశమంతా చెప్పుకొనే వారు. ఆనాడే ఆశాజ్యోతి పుట్టువు. విసిగించను "దేహినో దివసాగతాః" అవన్నీ బలవంతంగా మరచిపోవాలి—

## ఈ రోజుల్లో

"పైడిగడ్డ" పుల్కరించింది "పెదపాలపఱ్ఱు విజయ భారత నాట్యమండలి" వారు నా పర్యవేక్షణలో ఈ గడ్డలో చక్కగానే కృషిచేశారు. ఫలితంగా అపూర్వఖ్యాతి నార్జించారు కళారాధకుల్ని చుట్టుకొనే సహజకష్టాలకు తట్టుకోలేక ఇప్పుడి

ప్రస్తే త్రెక్కలాడ్చుకుంటూన్నారు, నాచేపట్టిన కృషికికాని నారచించిన కావ్యానికి కాని ఏనాడూ ఆటంకముండదనే నాగట్టినమ్మకం.

నాకృతులయందత్యాదరాభిమానాలు కల్గి "ఆశా జ్యోతి" ప్రచారాని కన్నివిధాలా తోడ్పడిన జాస్తి సాంబశివ రావు చౌదరి (డిస్ట్రిక్టు అండ్ సెషన్సు జడ్జి విశాఖపట్టణం) గారున్ను వారిసతీమణి సీతామహాలక్ష్మమ్మ బి. యల్. గారున్ను నాస్తుతి కెంతయు పాత్రులు.

ఆంధ్ర భాషాబంధులయ్యు మా "ఆశాజ్యోతి ప్రదర్శ నాలుచూచి యీనాటి వరకూ నేనంటే గాఢాభిమానంకల" పి. యం. నాయర్ ఐ. సి. యస్. (ఢిల్లీ సెంట్రల్ గవర్న మెంటు) గారున్ను నాస్తుతి పాత్రులే.

అనాటి యవ్యాజానురాగ మీ నాటికింకిపోక తమ హృదయమున నాకెంతో స్థానమిచ్చి యీ నా నాటకాలకు కృతి పతిత్వాన్నంగీకరించిన ఆంధ్రభాషా భోజులును కవికులా లంకారులు నగు శ్రీ జవ్వాది లక్ష్మయ్య నాయని వారును నాకిలవేల్పువంటి వారు.

మా నాటక ప్రదర్శనాల నాదరించిన విధంగానే నా కావ్యాల్ని గూడా ఆదరించబోవు నా మిత్రులకూ—తక్కిన సామాజికులకూ నా నమోవాకములు

విశేషించి నాయందూ నా నాటకాలయందూ అశేష జనాభిమానాలు ప్రదర్శిస్తూండే "ఆచంట" వారులకూ సోదర తుల్యుడు మా "తమ్మినీడి వెంకటనారాయణ" గారికీ నా యభ్యంజలులు.

కవులనాదరించుటలో గాఢాభిమానంగల తండ్రిగారి కేమాత్రమూ తీసిపోని కుడుకూరి స్వరాజ్య వెంకట సత్య నారాయణరావు గారు నన్నాదరించి యీ నాకావ్యాలను తమ బుక్ డిపో తరఫున సచ్చిత్రించిన కృతజ్ఞత నేనాజన్మంలో మరువలేను

ఇట్లు
రచయిత



## -: కృతిపతిప్రశంస :-

౧

తొలి తెలింగాణ మెల్ల శ-త్రులకవోష్ణ
రుధిరధారల గీర్తివి-ద్రుమముఁ బెంచి
తెలగనాయకు లిత్తెన్గు-దేశమందు
నిరవుకొని నాఁడు పెనుకొండ-నింతతట్టు॥

౨

కలదు జవ్వాది వంశమ్ము-తెలుఁగునేల
కాణిముత్తియ మట్టివి-న్నాణెమొప్ప
నందునుదయించె క్షీరాబ్ధిఁ-జందురట్లు
వెంకయాభిఖ్యుఁడయ్యగ-విశ్వదాంత॥

3

అతని పున్నెంపుఁ బంటనా-సుతులుగల్గి
రమలగుణధన్యు లిర్వురా-ప్యాయనముగఁ
బెద్దనరసింహమూర్తితా-నుద్దవిడిన
మర్వికంపించు పాలకుం-డూరికతఁడు॥

౪

సారసారస్వతేచ్ఛవి-శ్వమ్ములోని
కావ్యధర్మమ్ము నెఱిఁగిన-తాఁ-కావ్యగోష్ఠిఁ
గవిజనచకోరమయ్యవి-ఖ్యాతిఁ చిన్ని
లక్ష్మయాభిఖ్యుఁడుందువి-లాసరీతి॥

వ.

నే నొక్కనాఁడు నన్నుం బిలువ నంపి మాకుటుంబ శ్రేయ
మునర్థించు కవులలో మీరు కగ్రగణ్యులు—అది యుంగాక ప్రజామో
దముం బడసిన మీ విరచిత దృశ్యకావ్యము లేను గాంచని వి కావు
గదా! యనుచున్న నాయనిం జూచి ప్రియలోఁ దుచున్న నన్నం దర
హాసవిలాసమ్మునఁ జూచి——

తే.

కాళిదాసాది కవులకా-వ్యాలు గొప్ప
దృశ్యములు గావె! వాని కే-దేశమందు
నేనిఁ గొఱఁతలు గల్గెనే-పూని మీరు
దృశ్యకావ్యాలఁ గృతి నిచ్చి-తీర్పుఁడిచ్చ॥

ఉ.

సాదరణీయవాక్యముల-సమ్మతిఁ దెల్పెదు నంతదన్కనా!
మోదన దృష్టి నిల్పి "నవు-మీకెయొసంగుదు" నన్న నెన్కనన్!
సాదరబుద్ధితోఁ డవిధ-సమ్మతి గౌరవ మొప్పఁ జేసి, స
మ్మోదముతోడఁ గావ్యసుమ-ముం ధరియించెను హస్తయు
గ్మలిన్॥

తే.

మెచ్చెనా; హైడికానుక-లిచ్చిపంపెఁ
దెలుఁగుకవిరాట్టు లందేని-గలర యేసిఁ
బైడిపాలకి నరుదేరఁ-బంచిరత్న
ఖచితవేదిక నిచ్చెల-క్ష్మణవిభుండు॥

౯

తెలుఁగు ఫౌలాలకాతఁడొకదివ్వెయు, తెన్గు కవీంద్ర కోటికా
తలమునిలింప భూమికవి-తాలలితాంగికి మెట్టినిల్లు అం
పిలినది యందు ధర్మసుర-ధీరమణీయని నాదమొల్లది
కృ—లఁ పెనుగొండపట్టణము - కొంగున బంగరుగాదె
ఇమ్మహిన్॥

౧౦

కవికులాలంకృతియనుల-క్ష్మణార్యపుంచు
నిండు పేరోల గమ్ముఁ బండితులతో
ప్రాకటమ్ముగ శ్రీకృష్ణ-రాయలే భు
వనవిజయమునఁ గూర్చున్న-పగిదిఁదోచు॥

౧౧

అల్లినపద్దె మొక్కటికి-నక్షరలక్షలొసంగఁ జాలుమా
చల్లనిపైడిబాబయిపి-శాలవసుంధరజన్మ వెట్టి సం
ఫుల్లమృదూక్తిగావ్యసుమ-పుంజము లన్విరచింపఁజేసి, రా
జిల్లగ జేయు లక్ష్మణమ-హీంద్రుఁడు సత్కవికోటినిచ్చలున్॥

౧౨

పత్తాద్రిగ్రామమహీతున
కాతత కీర్తిప్రరోహ సి-వ్యాన్వయునకున్
ఖ్యాతింగల్గించుతదాఁ
శ్రితిన్మత్కవ్య లక్ష్మణో-ర్వీశునకున్॥

౧౩

శ్రీశాంతమ్మను నన్నయ
క్షేమమ్మును గుణతనైక-శ్రేయోన్నతియున్ ।
సీమమ్మనఁ గాఖ్యాత్మజ
సీతాంతమ్ములను యశోము-జనుకాతవిభవున్ ।

౧౪

జవ్వాది వంశమునయము
నివ్వటిలుంగాత భాగ్య-నిచయమ్మొంటం ।
గ్రుమ్మఁగఁ జాలిన తీరున
నివ్వసుధం గీర్తిఁగాంచు-చెసఁగుత నెవ్రుడున్ ॥—

ఇట్లు
కుటుంబరావు కవి

# ప్రారంభగీతి

కళావిలసితము
భరతఖండమూ—
కల్ప-కల్పముల మనియుండాలి ॥కళా॥
కార్మిక-కర్షక-సామరస్యమున
చక్కనిబాటల్లొ డెక్కాడే సభ్యత
నలవరు పంజను నాదర్శములతో
గ్రతుల భారతిని గెలుకొల్పగా ॥కళా॥

## నా రక్తాంజలి

రామరాజ్యాన్ని మించు, రైతురాజ్యాన్ని సృష్టింపగ
దీక్షా కంకణం దాల్చి, అహరహమూ
సంఘాన్నెదుర్కొంటూన్న
విషమ సమస్యల నెన్నింటినో
ఎదుర్కొనుచు
మతావేశపరుడగు నొకహైందవ
పాషండుని రక్తపిపాసకి
కాహుతియైన
పూజ్య "బాపూజీ" పవి
త్రాత్మకు ఇది—
నారక్తాంజలి

# పైడిగడ్డ



రసం:—కరుణ. ఉదయం 10 గంటలు—పైడిగెడ్డ

(వైశాఖశుద్ధ పూర్ణిమ, ఆ గ్రామంలో రైతులంతా నాగేటి—కాడీ—మోకూ—చెరుతలు పట్టుకొని—ములుకర్ర—మువ్వల పట్టెళ్ళు—తలకొకటి ప్రచుట్టుకొని—పళ్ళెంలో పసుపుకుంకాలు తీసుకొని చల్లుకుంటూ—పాట పాడుకొంటూ—సంతోసంగ పెఱు వాకసాగిస్తూ—నీర్కావి ధోవతులూ—తలగుడ్డలతో వస్తూంటారు. కాళ్ళకు ముతక చెప్పులుంటాయి వ్యవసాయపరిక రాలకు బొట్లు పెట్టబడి ఉంటాయి. రామానందం;ఇస్మాయిల్; రైతు రంగయ్య మఱికొందఱు రైతులు సమూహంగ వస్తారు.]

పాట:

ఓ విశ్వపోషకా ?
ఓ పైడిబాబూ ?
రాకోయీ ॥ఓ॥

ఒంటరిగ చేనిలో—
కంటతడి పెట్టేవు—
మంటిపాల్ కాదు—నీ—
వొంటి శ్రమ యిక మీద ॥రా॥ఓ

(పై చరణంపాడుతూ—పక్కకు తిరిగివస్తారు. తెలుపే చును. విశాలాక్షి పసుపూకుంకుమలు—పువ్వులు—చల్లుకుంటూ అర విన్యాసంగా పాట పాడుకుంటూ సమూహంలోకివచ్చి కలిసి—పరికరాలకు పూజచేయును.)

పాట:

విశాలా:- ఏరువాకలు పొంగి——
పారి మాపొలములలో——
పైరుపంటలు పెరుగ——
బండాలి యీఏడు——
పంటకాపుకు, ప్రాణా——
పదమైన మాయెడ్లు——
కాలాలు పదిమాకు——
కలిసి పనిచేయాలి ॥ఏ॥

(జైమహాత్మగాంధీకి జై అంటూ కొబ్బరికాయలు కొట్టును. జై హింద్ కిసాన్ పంచాయత్—జిందాబాద్ అనే కేకలు)

రామా: అందాలుచిందే - యీ వసంతకాలంలో - బూజు పట్టిన పరికరాలన్నీ దులిపి పండుగ చేసికొనేభాగ్యం మన కెన్నాళ్ళకు కలిగింది! పండుగ పున్నమాలంటూ ఒక్కవానకురిసిందంటే నాగళ్ళుకట్టి మనబంగారుగడ్డం తాదున్నిగరిసెలుపండించొచ్చురా! ఇంకో-ఏరువాకనా టికైనా-మనమాపొలాన్నినమ్మి చేసుకునే అవకాశం కలిగి పిల్లాజల్లా సుభిక్షంగా ఉంటామేమొఅని నాఆశ.

రంగ: మనకాష్టన్నం కళ్లకట్టే భాగ్యం ఉండాలని—

రామ: లేకుంటే మాత్రమేం చేస్తాంగాని – యీ భూస్వాముల చేతుల్లో పైడితునకల్లాంటి యీభూమంతా మలినమై పనికిరాకుండాపోతుంటే పాటుపడే వాడికి కండలు పల కరిస్తాయోయి దాదా

ఇస్మా; హైరత్ హై! రంగన్నా! సరేకాని, మొకాకా – పల్లాలు సరిచేసుకొంటానికైనా డబ్బిస్తారా! ఈ రామయ్య బాబు?

రంగ: వాడిపెట్టెలోకిస్తే – యీభూములు మనకిచ్చి మనరక్తాన్ని త్రాగడమెందుకు?

ఇస్మా; మరికీహాస్తే – పాకడా పోతుందిభాయి? మళ్లీపంట లోపిస్తాంగా?

రంగా; అసలా హృదయమనేదేఉంటే – మనమిల్లా ఏడవట మెందుకు?

ఇస్మా: తుండూ – తుపాకీ – ఎగ్గొడితే – ఏంచేస్తార్రా?

రామా: పిట్టపోరు – పిట్టపోరూ – పిల్లితీర్చినట్లు ఈ సాధక బాధకాలిల్లాగె ఉంటే ప్రభుత్వమే చేస్తుందాపని.

రంగ: ఏమోనాయనా! నాకానమ్మకం లేదు. మనముచేయ కాత్రప్పటం లేదు. పొలాలు మనవేనన్న నమ్మకమూ లేదు మీకేమో చూద్దాం – చూద్దాం అంటారు.

ఇస్మా: ఠీక్ హై కుచ్ భీ ఆరామ్ నై ఘర్ మే చావల్ భీ నై.

విశాల: దాదా: కష్టాలెల్ల కాలముండవు. (చూచి) అదుగో అన్నయ్యా! జగం బావకూడా-ఇటేవస్తున్నాడు.

జగం: ఏంబావా! పండుగచేసుకుంటున్నారే! నేను కూడా భోజనానికిరావచ్చా!

విశాల: భోజనం పెట్టేపాటిసత్తువేవ్వుంటే బాబులిల్లా పరిహాస మాడతారా!

జగం: విశాల! బాధలున్నపుడైనా బంధువుల నాదరించాలి

విశాల: బంధుత్వమన్నది పరిసరాల్లోనే తూగుతుందిగాని—

జగం: ప్రక్క-వీధివాళ్ళం పరిసరబంధువులం కాక ఏమౌతాం.

రామా: అయినా జగం! మాజతకువస్తే - మీనాన్నవూరుకోడు.

జగం: ఆయనేంచేస్తాడు బావా?

రామా: పెత్తనకూచ్చేసె పెద్దలకివన్నీ పీడలుగా ఉంటాయిజగం.

జగం: నీవు-నేను-విశాలా-నిన్న-మొన్నటివరకు - వకేస్కూళ్ళలోచదువుకున్నాం గదా! మనంకలిసి మాట్లాడటమూ-కలిసి ఆడుకోవటమే ప్రమాదమా? బావా!

రామా: జగం! నాన్నపిలుస్తున్నట్లున్నాడు వెళ్లిరా! మళ్లీ...

విశాలా: జగం! మళ్లీ కలుద్దామా?...

జగం: తప్పక (వెళ్ళును)

## పైడిగడ్డ

ఇస్మా: బేటా! హీఁళ్కా హఁందర్కీ హమ్‌లోగ్ నమ్మకటాన్కీ హేఁల్లాగా! ఏంచేద్దాం

రామా: నమ్మకంచేసుకొంటానికి వీలుగా ప్రయత్నాలన్నీ చేద్దాం తొందరపడకండి మనమిల్లాగ చేస్తుంటే వాళ్ళకేనమ్మకం కలుగుతుంది.

ఇస్మా: మన్కీ సె ఝుకా హో తె-ఔర్ కయీ కోయీ అద్మి ఇస్ ఖేత్ మె నహీ-ఆయెగా హిఁడ్కీ ఖేతికా భలేనమ్మక హరాంబేటా

(చెమటకారుతున్న శరీరంతుడుచుకుంటూ నాగయ్య ప్రవేశం)

నాగ: అమ్మా! కాసిని మంచినీళ్లియ్యమ్మా!

విశాల: (విని) దాదా! మీరుత్సవం వెంట పదండి నాన్నకు కాసిని మంచినీళిచ్చి చెప్పొస్తా—నాన్నా వస్తున్నా (ఎదురుగా వెళ్ళిమంచినీళ్ళిచ్చును.)

నాగ: (త్రాగి) నీవేమో ఉత్సవాలంటావు రొట్టెముక్కకు చుట్టుముాగిన పిల్లుల్లాగ అప్పులవాళ్ళెమోగమిడి కాస్తు న్నారు. ఏంచెయ్యాలో ఏమో—

విశాల: ఏంచేస్తాం నాన్నా! పంటల్లో ఇవ్వగూడదూ? (ప్రక్కకు చూచి) ఈనిశాచరుడు యిల్లావస్తూన్నా డెందుకునాన్న

నాగ: ఒరేయి గంగన్నా! ఇస్తామన్నాంగా. ఇంతలోనే మళ్ళీ వచ్చావెందుకురా?

క.గం: కోతలనాటి బాకీలు మళ్ళీ పూడ్పులొచ్చేదాకా వుంటే ఎల్లా ఊరుకుంటాడా యన మాత్రం.

విశాల: మాకిచ్చిందేదో సింజలమ్మిస్తారనుకోవాలిగాని మధ్యగా ఎక్కడనుంచి తెచ్చిస్తారనుకొంటాడు పెట్టినవాళ్లుమాత్రం

క.గం: మాబాబుగారు మీ పైరునువ్వులు అమ్మి ఇస్తానంటేనే యిచ్చారు.

నాగ: ఓకేయి గంగన్నా! నువ్వులేదు-గివ్వులేదు. డబ్బు చేతికొచ్చాక నేనే తెచ్చిస్తాలే వెళ్లు వెళ్లు. అమ్మాకు నువ్వా నువ్వుల పళ్ళికలు లోపల సద్దమ్మా.

క.గం: తెస్తారు వెనుకటిది యిదీ కలిపి మూడువందలయిందట.

నాగ: ఎన్నయినా ఎగవెయ్యం తేవోయి! వెళ్ళిరా!

క.గం: ఆ ... ... ఏంచేస్తామా? ... ...

నాగ: ఏం గంగన్నా! చెప్పేది నీకాదు వెళ్ళిరా!

క.గం: రావటం వెళ్లటం కనిపిస్తోందేకాని వసూలయ్యే విధానం లేదు. ఆ నువ్వులే మాకిస్తే మేమాబాకీ క్రింద జమ కట్టుకుంటాంగా!

నాగ: మంచిపనే చేస్తారు. అన్నిమీకిచ్చి మొన్న కోతకూలిలకు ఎక్కడనుంచి తెచ్చివ్వాలి.

క.గం: కూలోళ్లు ఆళ్ళే పూరుకుంటారు లేవయ్యా!

నాగ: కూలోళ్లకు కూడు లేకున్నా దొరగారి డబ్బేంలో మాత్రం పడవెయ్యాలి? వెళ్ళు-వెళ్ళు ఇస్తాంలే.

క.గం: ఇస్తారు. అయినేమో, అరనిముసమైనా మరచి కూర్చోడు. వస్తేనేమో ఇదీసరుస చాల్లేవయ్యా! అంత

రోసమునోళ్ళ డిపిల్లా పారవెయ్యరాదూ? మళ్ళీవస్తామా?
"వెళ్ళండిరా" "ఆగండిరా" అనివేప్పకు తింటాడాయన'
(లోనికి వెళ్ళిపోతూ-పోతూ తిరిగివచ్చి) చెప్పాల్సిన
విషయం మర్చేపోయ్యా (నసుగును)

నాగ: ఏమిటా విషయం!

క.గం: మరేం లేమగాని బాబయ్యా! వాసిరెడ్డి వారేమో ఏరా
జగం బాబు పెళ్ళి విషయంలో వస్తారట. ఎంద
రొస్తారో ఏమో! వారేమో పెద్దెత్తు కమ్మాము
కాబోలు. "ఓరేయి నాగయ్యగారితో వాళ్ళమ్మా
యినీవేళ పంప మన్నానని చెప్పరా! కాస్త ఆసరా
కావాలి" అన్నాడు మాపెద్దబాబు,

నాగ: మంచిపనే గంగన్నా! మేమూ మాపిల్లని గారాంగానే
పెంచుకుంటున్నాము. ఈడొచ్చినపిల్ల వచ్చేవాళ్ళేమో
సంబంధానికి, అయినా భాగ్యవంతులగడపల్లో మా
పిల్ల పదేపది గాన్పిస్తుంటే పల్చదనంగా ఉంటుందోయ్!

క.గం: సరే మీయిష్టం. (ఉభయులూ వెళ్ళుదురు. ఇన్నుపై
జగం రంగంపైకి వస్తాడు)

విశాల: ఇదిగో! జగం ఎక్కడికి?

జగం: ఇక్కడికే. అల్లా ఉన్నావే?

విశాల: మాకేంగాని నీకేం తీరిక లేదనుకుంటా.

జగం: ఏం?

విశాల: పెళ్ళితొందర.

జగం: ఎవరికీ?

విశాల: నీకే.

జగం: ఒక్కణ్ణే కలిపావే! మఱి—(అర్థోక్తి)

విశాల: చాల్లే జగం. ఎందుకొచ్చిన మాటలు?

జగం: అంటే...?

విశాల: అంటేనా—? అసలెల్లా కుదురుతుందిలే. నీవేమో శ్రీమంతుల బిడ్డవు – నేనేమో పుట్టెడప్పుల్లో మునిగిన నా తండ్రినెప్పుడు "టాం—టాం" వేద్దామా! అం నీ తండ్రి కూర్చున్నాడు. ఎల్లాతూగుతుందిలే?

జగం: ఇందంతా నేనన్నానా? విశాలజగంలో

విశాల: విశాల లేదు. జగంలేదు. ఎందుకీమాటలు?

జగం: విశాలత్వంలేని ఈ జగంలో — బ్రతుకే భారం విశాలా!

విశాల: ఎందుకీ మాటలు?

జగం: క్రొత్తగ మాట్లాడుతున్నావు.

విశాల: నేనా—?

జగం: అవును నీవే!

విశాల: ఓవైపున పెళ్ళిబేరమూ – రెండోవైపున నాతో పరిహాసమూ! చాలులే.

జగం: ఇదా నీకోపం. అవన్నీ మరచిపో.

జగం: ఇంకా సందేహమా! (ఉద్వేగం) ఈ సర్వస్వం నీది. నీవెల్లా నడిపిస్తే ఈ రథచక్రమల్లా తిరుగుతుంది. నమ్మవు విశాలా?

విశాల: పవిత్ర ప్రేమాశయంతో బాటు - మనముభయులం- సర్వ మానవ దైన్యాన్ని మాపే విపులాశయం కోసం పాటుపడాలి. మీ నాన్నగారి హయాంలో -- ఎన్నో బాములు పడిన రైతుల కష్టాలన్నీ - నీచేతి నేత్రసంలో తొలగిపోవాలి జగం?

జగం: నాన్న మనసువిరచి అన్నీ చేద్దాం. ("అమ్మా విశాలమ్మా! మన రామానందాన్ని పిలువమ్మా" అంటూ నాగయ్య ప్రవేశించి జగం చేతబుచ్చుకొని రంగం ముందుకు తీసుకువచ్చి)

నాగ; (దైన్యంగా) నాయనా జగం! లోకం కోడై కూస్తోంది మాయింటికి రావడం తగ్గించుకో బాబు. మేం బీద వాళ్ళం. నలుగురు నాలుగురాళ్ళువేస్తే మేమెంతో వ్యథపడాలి.

జగం: ఓహో భయమా ... మామయ్యా ... రానులే ... సరేలే ... (అని హృదయభారంతో ప్రక్కకుచూచి వెళ్ళును)

విశాల: (తొందరగ వచ్చి, తండ్రిచేయిపుచ్చుకొని) ఏమిటి నాన్నా జగం బావను మనింటికి రావద్దంటున్నావే?

నాగ; ఎందుకంటే అమ్మా చదువుకునే రోజుల్లో ఉండే సాహసం అంతటితో సమసిపోవాలిగాని — కొనసాగించడం అంత మంచిది గాదుతల్లీ!

విశాల; ఏంనాన్నా—?

నాగ; అతడేమో డబ్బున్న వాళ్ళబ్బాయి. నీవేమో పరిస్థితి లేని అమ్మాయివి. ఏఱనేగాని చేనోలేని వానిబిడ్డవు.

విశాల; అయితే

నాగ; నీకా పెండ్లియీడు వచ్చింది. అతడా వయసులోనున్నవాడు. మాటికి మాటికి మనింటి కెందుకమ్మా?

విశాల; మేమేం జేశాం నాన్నా —?

నాగ; ఏమో అమ్మ కలకాలం బుద్ధులొకతీరుగ నుండవుతల్లీ మనమున్నది సంఘంలో సంఘదూషణ సహించలేము. పైగా - ఆయొచ్చినా - పయొచ్చినా సమర్ధించుకో డానికి - మీతల్లి (కన్నీరు) మనకు దూరమయ్యింది. నిన్నిగూట్లో పెట్టుకుని కాసిని కాసుకు తాగుతూ కాలం వెళ్ళదీస్తూ కలిసొచ్చిన్నాడు — ఆ మూడు ముళ్ళూ నీకువేయించి ఆనందిద్దామని చూస్తున్నా.

విశాల; ఊరుకోనాన్నా అయినదానికి కేడ్వడమెందుకు?

నాగ: పైగా ఇయ్యేటి తుఫానులో మన పంటలన్నీ సర్వ నాశనమై అప్పులెల్లాతీర్చాలో అలుసాలెలా ఆకట్టాలో నాకర్థం కావడములేదు.

విశాల; ప్రభుత్వంమీద కాదునాన్నా మనం కత్తిగట్టవలసింది మానవసమాజాన్ని చైతన్యపూరితంచేసి ప్రజా యంత్రాల్ని బాగుపరచాలి! అప్పుడే సరియైన ప్రభుత్వం సృష్టింపబడుతుంది. ధనికులందరికి ప్రజాహృదయంచూపి వారి ధనరాసుల్ని ప్రజోపయోగానికి మళ్ళించాలి.

ఇస్మా; ప్రజల్ హూపయోగమున్నా ఈకాసిలి ప్రజలు రామయ్యాబాబూ ఘరిసల్లో పడ్డాక హూస్కేబాద్ మనం హేమిట్లాసెయ్యాలా! చేటామసాల్! మస్కేమిగి లేది లేదు. బాబూ పూరాసాల్ భక్కేదెల్లా?

రామూ; ఫరవాలేదు దాదా ఇయ్యేడు తలంచి బ్రతికితే ఇక్కడనుంచి మనమంతా కలిసి వ్యవసాయంచేసి ఎక్కువ పండిద్దాం. కలిసి చేసిన పనిలో కావలసినంత మిగులు చూపుతుంది. అందరమూ పొలంగట్టునే పరుండి కావలసినంత పైరల్లా పండించొచ్చు అందుకే అందరముఃపుండడానికి వీలయ్యేలాగ ఒకయిల్లిక్కడేట్టుకుందా అదున్నిబట్టి అన్నీ పండిద్దాం. మన సమిష్టి జీవనమే మన సమాజ జీవనానికి పునాది! ఏ దేశంలో చూచినా. మన వ్యవసాయవృత్తి ఒక లాభదాయకమైన వృత్తిగానూ, వ్యాపారంగానూ పరిణమించి దేశానికీ – దేశీయులకు జీవన ప్రమాణాన్ని పెంచుతూ జీవితాభ్యున్నతికి తోడ్పడుతోంది, కాని మన భూములన్ని కలిపి సమిష్టి వ్యవసాయ క్షేత్రంగ నిర్మించి బాగా పండించి

చైతన్యం కలిగించాలి. కాన మనం చేసే భూము లన్నింటిలోనూ మన మందఱం కలిసి పనిచేసి - కలిసి పండించి - కలిసి మరమ్మతులు చేస్తే - మన క్షేత్రా లన్ని సుక్షేత్రాలై మనకు రత్న నీరాజనాలిస్తాయి. మనమంతా ఒకచోట నివసిస్తూ సోదరులవలె ఒకే యింటిలో ఆహారం తీసుకొంటూ దారుణ క్షామ దేవ తలను మన దరిచేరనీయకుండ బాగా పండించాలి. రండు ! రండు !!

## రామానందం పాట:

రావోయీ! హాలికా! రావోయీ!
రావో ॥రా॥

కడలేని - సుడిగాలి
పడవలో - బయసించి
అడియాస - కొల్వ్యాలో
ఆకటికి బడిచచ్చి ॥రా॥

మండిపొయ్యే ధరలు
గుండెకూ కాసంత
నిండు గనరాదురా
కండ కరగించినా ॥రా॥

సీక్రూ సీక్రూ కలసి
తాపి చెడకుండంగ

సేద్యమ్ము చేసి యీ
చేను పండించవోయ్ ॥రా॥

కలిసి శ్రమియించి నీ
కండగార్చిన నెత్తు
నిండింప నీ పైడి
గడ్డ మన్నాలోయ్ ॥రా॥

జై మహాత్మ గాంధీకి జై ! రైతు సంఘాలకుజై !!

( య వ ని క )



# పైడిగడ్డ



## ద్వితీయ రంగం

మహాల్ తెర—రసం—ధర్మవరం

(మడత మంచము—పడకకుర్చీ—హాలుకిటికిలో మంచం దగ్గర ఖాళీసీసాలు పడియుంటాయి క. గం. చేయినులుము కుంటూ కూర్చుంటాడు గాజుగ్లాసు అటూ యిటూ తిప్పు తుంటాడు. ప్రక్కన అగరు వత్తుంది.)

రామ: ఇదుగో ఆరంగయ్యకాపు జలుబునీళ్ళు కాసిని కూడా వదిలిస్తేనేగాని రోగం కుదిరేట్టు లేదు.

క.గం. వాడితలతుప్పు వదిలిస్తే బాగుండును. "అచ్చన్న రైతింటికి మాటిమాటికీ నీకేంపనోయ్? తలబిరుసుగా వుందేమోయ్" అని నన్ను కవ్వించి మాటాడుతు న్నాడు బాబు

రామ: వాడి సొమ్మేంపోయింది అయినా అచ్చన్నకు బుద్ధిచ్చం డనవసరంలేదూ? మొన్న మన తడాఖా తెల్సిందిగా? పోనీలెమ్మని పోషణ భారమంతా నేను తీసుకుంటా నన్నాగా?

క.గం: అచ్చన్నకూతురు అంజమ్మకూ - ఏడికీ ఏమైనా సం
బంధముపడ్డిందో ఏమో!

రాము: సంబంధం చుట్టుబండలు అన్నీ నేనే చూస్తానన్నాగా
ఏమండగూడదు. దివాణంలాంటి

క.గం: దొంగ్లోకాళ్ళదగ్గఉనికేపంగ ఏమండొచ్చు మీరెంతో
దయ గలవారు.

రాము: అయితే గంగన్నా! ఇంకా విశేషాలేమిటోయ్.
నీబిడ్డకేమాత్రం నేనెక్కువగా సంతోషిస్తుంట ఇనుగో
ఈడబ్బుతీసికొని మనిద్దరి ఖాతాకొట్టులోపెట్టు, ఈ
ఆలోచనతో వేడెక్కిన బుర్రకదికాస్త అంటుకోగానే ఏడే
సరికి హాయిగ నిద్రపట్టిందోయ్

క.గం: (నీసాత్రిసి) ఇక్కడ వారవేశారే! అందుకే మీదగ్గర
నుంటానంట నేనుంటే మేకేలోటురాదు.

రాము: అవునోయ్ అయినా అంజమ్మయిక్కడే

క.గం: ఆమనిషి మాత్రం బహుకష్టంగావుంటుందండి. తమ
దృష్టిలో ఎట్లాపడిందోగాని! దాని మొగుడొక బట్టి
దేభెమ్మ గాలివానతో వాడి కథమాసి దీన్నిలాతోలే
డని పుకార్లు.

రాము: లేకుంటే ఏ ఆసరా ఏగతీ లేని ముండాకొడుకుల కండ
జకే బిడ్డలే చెప్పేదేమైనా వినాలంటావా!

క.గం: నేనేన్ని చెప్తున్నానండి.

రామ: చెప్పవోయి నేనెల్లా అనుకుంటూను.

క.గం. సమయం దొరికినప్పుడల్లా యిదే పాఠం. "అయన కాస రగ అదీ — యిది అందిస్తుండమనవోయి, అకడదిక్కు లేని సంసారం. అనుగ్రహం కలిగిందా అరుదాలు సాధించగలమని పోయి" అని చెప్తునే వున్నాబాబూ.

రామ: (సంతసం) అదీ చెప్తూనే వున్నవన్నమాట.

క.గం: ఆహా! యింకెన్ని — ఎన్ని—!

రామ: (ఆత్మృతత్రో) ఇంకేమిటి!

క.గం: అనుగ్రహం కాలిందా అన్నీ సాకాఅప్పగిస్తూ కా అయన ప్రదస్సుచేసికొని నిల్చున్నాడా రాజాధిరాజు కాడ టా అని

రామ: లోకం నన్నేమను కొంటున్నారో! అటు కన్నైనా ఎత్తిచూడను తెలుసుగా!

క.గం: తమరు చూడాల్సిన పనేముంది – హుకుం అయిందా అన్నీ తమ కాళ్ళదగ్గఱకే ఇంతకీ అమ్మగారు – మీ మంచిరోజుల్లో పోటిగాని లేకుంటే మీాకివన్నీ కావాలా?

రాము; అయితే నేనంమకు తగినట్టే ఉంటానన్నమాట,

క.గం: తగినట్టూ ... ...! ముష్టైఅయిదుమించి ఉండవను కుంటారు.

రామ: అయితే మంచి జోడన్నమాటే—!

క.గం: జోషూ - మీయిద్దరి నమూనా ఎల్లాఉందను కుంటు న్నారు?

రామ: సరికాని మనవల్లో పడేనా?

క.గం: పడేనా రేపీపాటికి ముస్తాబై ఉండండి. ఆ నాగయ్య చౌదర్ని మాత్రం కాస్త కనిపెట్టి ఉండండి.

రామ; అదెంతలో! కాతాబాకీ డిక్రీ అయిందిలే. వాడూ వాడికొడుకూ గ్రామంలో ప్రతిదానికీ నిల్చుంటున్నా రులే. యీ దెబ్బతో సరి యిల్లా ఆరోగం కాస్త వదిలిస్తే - మన ఖాకా క్రగ్రామములో ఎదురులేదు ఏమం టావు?

క.గం: నిజమే నిజం. బాగాచెప్పారు. మరి శెలవా!

రామ: (వెళ్ళిబోవు గంగన్ననుఆపి) ఒరేయ్! నీవీపూట కాస్త అందుబాటులో ఉండు వాళ్ళెవరో అబ్బాయి సంబంధం ఖాయంచేసికోటానికి వస్తారట.

క.గం: అంతకంటేనా!

రామ: (వెళ్ళ బోవు గంగన్నను పిల్చి) ఒరేయ్ యింకొక విషయం చెప్పావుకావే?

క.గం: నాగయ్యగారమ్మాయా బాబూ?

రామ: ఏడిశావు వెంకయ్య వేమారం వెళ్ళొచ్చినట్లు చేశా వన్నమాట. అంతేనా?

క.గం: కాదుబాబూ పిల్లనిచూశాను.

రామ: ఓరి వెధవా. నాగయ్య ఏమన్నాడురా?

క.గం: ఏదో చెప్పానుబాబూ.

రామ: మొత్తుకోలేక పోయావు మొండివెధవ?

క.గం: కానుబాబూ సనేమిరా పఠంనన్నాడు.

రామ; ఇంతకూ నీవుతెచ్చిన రాయబార మిదన్నమాట. మంచిపనే.

క.గం: మంచో చెడ్డో చెప్పినవిషయం చెప్పాను.

రామ: ఒరేయ్ గంగన్న ఆమూలున్న మన బంగళా పక్కనే పూరింటిలో ఓ అమ్మాయి తొలకరి మెఱుపల్లే మెఱ సిందెవరురా?

క.గం: మీరుచెప్పేది మాయిల్లండీ.

రామ: ఆ అమ్మాయి ఎవరురా?

క.గం: మా ఆవిడండి.

రామ: చెప్పావు కాదేంరా?

క.గం: స్వవిషయంకూడ తమతో చెప్పాలా బాబూ!

రామ: ఎవరో ఆ అమ్మాయి!

క.గం: మా ఆడదండి దొరా?

రామ: దొరగారి కళ్లుగప్పి కొట్టుకొచ్చావురా! మంచిదాన్ని మంచిదాన్ని పట్టావు. ఆడది కాస్త అందంగవుంటే ఎగబడి చూడరట్రా!

క.గం: మా నిబ్బరమయ్యింది బాబూ!

రామ: కావ నెవరన్నారు గాని కళ్ళు కన్ను చూపించలేదేరా. అల్లాదొడ్డి కేసివచ్చినప్పుడు మీయింటివద్దే అసీసా జాగ్రత్త చేసిపుంచు అక్కడే...

క.గం. మాయావిడకివంటేచాల తలనొప్పిబాబూ! అల్లా కంట చూచిందో నాబోల్లో బొమ్మరాయి కొట్టేంపన్న మాటే

రామ: ఇంత భయంతో నీవా కాపురమేంచేస్తావురా?

క.గం: ఏమోలెండి ఇలా బ్రతుకనీయండి.

రామ: ఒక్కసారి ఆ వంతెనమీదుగ వెళ్ళి పోలీసు హెడు గవరయ్యని నేరమ్మన్నానని చెప్పు. ఎల్లుండి పొలాల స్వాధీనం విషయంలోకాస్త రగడ సాగేట్టుంది. భూస్వాములంటే చప్పగా పల్చబడనమై పోయిందీ రైతులకు ప్రజాప్రభుత్వము, ప్రజాయుగమట, సత్కారాలంట సంస్కరణాలు జరగాలట ముందు వీళ్ళందరి...

క.గం: వీపులు మరమ్మతులు జరిగితేనే కాని...

రామ: రోగం కుదురదు.

క.గం: చిత్తం సెలవు. రాత్రికేమైనా— —?

రామ: ఈవేళంతా వెట్టిముండాకొడుకులు చుట్టు మూగేట్టున్నారు. చూదాంలే పదరా!

[గంగన్న వెళ్ళి హడావిడిగ తిరిగివచ్చును]

క.గం: (అన్నివస్తువు-మంచం-కుర్చీలు దులుపుచు) బాబూ—? బాబూ—? రానేవచ్చారు.

రామ: ఎవరురా?

క.గం: వాళ్ళే బాబూ – పెళ్ళివాళ్ళు.

[రామయ్య చుట్ట వెలిగించి ముందుకువచ్చి]

రామ: దయచేయండి(కుర్చీచూపును (వివాహాల వీర్రాజు ప్రవేశం)

వి.వీ: (నమస్కరించి) ఏం బాబూ కుశలమా? చాలకాలమయింది. తమరినిచూచి అయితే మా వాసిరెడ్డి వారూ, మీరూ వియ్యాల వారవుతున్నారంటే - ఏం భాగ్యం? బాబూ, పెళ్ళిళ్ళరోజులు. క్షణం తీరిక లేదు. అబ్బాయినోకసారి పిలిపిస్తారూ?

రామ: ఒరేయ్ గంగన్నా మన జగాన్నిలా పిల్చుకురారా! [నౌకరు తమలపాకుల పళ్ళెం తెచ్చి ముందుపీటపై వుంచును] ఏమంత హడావుడి? ఈపూట మా ఆతిథ్యం ...మా శాస్త్రులుగారింటిలో ...ఒరేయ్!

వి.వీ: తమరల్లా సెలవియ్యాకండి... మరి ... మనవిచేశాగా, మీ ఆదరణా, మీ పరామర్శా...[గంగన్ననుచూపి] ఈ అబ్బాయి యెవరండీ?

రామ: మావాడేలెండి. వాడి తల్లిదండ్రులు చిన్నప్పుడేచచ్చిపోతే వీళ్ళనాన్న మా కమతం మీదుంటూండేవాడు

లెండి. అప్పణ్ణించి మాయింటిలోనే పెంచారులెండి మాతో బాటే (క. గం. ను చూచి) వీడిరా!

క.గం: వస్తున్నారండి. [జగం వచ్చును. వి. విశ్వం కుర్చీ చూపును. కూర్చొనును].

వి.వి: రా నాయనా, రా ఇలా కూర్చో. శ్రీమంతులు చదువు కుంటున్నారా యే... ...?

జగం: చదువులేనాటో మానాల్సి వచ్చింది.

కామ: [తాను లేచి-విశ్వంతో] మాట్లాడుతూండండి. ఇప్పుడే వస్తా [గంగన్నను సైగచేసి జాగ్రత్త అనే హెచ్చరికతో వెళ్ళును]

వి. వి: చదువు మానటమేమిటి నాయనా!... శ్రీమంతులు.

జగం: అదే కారణం

వి. వి: ఔనులెండి లక్ష్మీ సరస్వతులు... బాబూ! తమనగదు కాతా ఏమాత్రం ఉంటుందంటారు?

జగం: నాకేం తెలుస్తుంది. అదంతా నాన్నే.

వి. వి; తమదంతా సొంతకమతమేనా! మీరెప్పుడైనా వెళ్తూంటారా!

క.గం; కొంతేలెండి సైకిలుమీద వెళ్ళి వస్తూంటారు.

జగం; ఎలాజరిగినా చూడాల్సిన పనేముంది?

వి. వి; సరి సరి ఇంటికెళ్ళి పట్టుకొస్తాయో!

క.గం; (గరిసెలవంక చూపును)

జగం; ఏమో కొట్లల్లో ఉంటై. ఎల్లా తెలుస్తుంది.

వి. వి; మహాభాగ్యం... ఎంతయోగ్యుడండీ. ఈ రోజుల్లో కాస్త కాళ్లొచ్చి—

జగం; (గంగన్నను చూసి) ఏమిట్రా ఇదంతా! నేను లోగడే చెప్పేశాగా నాన్నకి. ఇదేం రభసరా?

క.గం; (నోటికడ్డు పెట్టి) మీకేం తొందరపడకండి. చెప్తాగా

వి. వి; ఏమిటోయి. గంగన్నా?

క.గం; మరేం లేదులెండి.

వి. వి: ఏమిటో అంటున్నారే?

క.గం; ఏమి లేదుగాని, ఆబ్బాయి కాస్త సుజ్జువాడు కాదండీ?

వి. వి; అయితే—?

క.గం; మరేం లేదుగాని; లోపల పేమ ...—

వి. వి; మనలో మాటోయ్! వారుకూడా చాలా పెద్దయెత్తువారు.

క.గం: ఎలాగైనా ఖాయం చేద్దాం. నామాటంటె చిన్నబాబు (అర్థోక్తిగా)

వి.వి: మంచిగురేనన్నమాట. నీ కష్టం మరచిపోములే.

క.గం: అలా సెలవిచ్చారో ... మా చిన్నబాబు కట్నా కానుకల్లో-

జగం: కావాలని ఏడ్చిందెవరురా?

క.గం: బంగారం ఒకయెత్తూ — అమ్మాయి ఒకయెత్తునూ బాబూ?

జగం: నేనవన్నీ కావాలన్నానటరా?

క.గం: లేదులెండి. పెదబాబుగారు వస్తున్నారు.

రామ: (ప్రవేశం విసుగుతో) ఏమిట్రా గంగన్నా?

క.గం: మరేంలేదు బాబూ! చిన్నబాబు—

రామ: ఏమంటున్నాడేం - వాడి మాటలకేంగాని - అనలక్షా వేలూ

క.గం: ఆ... ప్లీమత్ కారూ—

రామ: ఏమైనాడుంటే-అల్లా అడగరాదూ- అదా! సరేవిశ్వం గారూ ఖాయంచేయించాడి.

జగం: (తీవ్రం) నేనివన్నీ అడిగానా నాన్నా?

రామ: ఇంకేమిటో అడగరాదట్రా? గంగన్నా! విశ్వంగారిని మేడపైకి కాఫీకి తీసుకెళ్ళు. వెళ్ళిరండి బాబూ! (గం గన్నా-విశ్వం వెళ్ళుదురు)

జగం: నాకివేమీ వద్దునాన్నా!

రామ: మరి—?

జగం: పెళ్ళి విషయములో నా నిశ్చయమేమిటో నీకు లోగడే
చెప్పేశాగా!

రామ: ఏమిటా వెధవ వేషాలు? చాలించు

జగం: నాన్నా! బలవంతంగా కట్టిన పెళ్ళిళ్ళెన్ని బుగ్గిపాలై
పొయ్యాయో లోకంలో. మీరాలోచించడంలేదు

రామ: అయితే నీవే సంబంధం చేసుకోవట్రా?

జగం: నేను స్పష్టంగా చెప్తున్నా నాన్నా. నేనూ-విశాలా-
పరస్పరం, బాస చేసుకొన్నాం

రామ; బాస! వెధవ! నీచాని కొడిగట్టావు.

జగం; నీచమేమీకాదు. తోటి కులం పవిత్రమైన రైతు
కుటుంబం.

రామ; పవిత్రం! కుటుంబాల్ని చక్కదిద్దుకోలేని నాశ్శంత్రా
రైతులే! వినవు కాదట్రా

జగం; నా నిశ్చయాన్ని నేను మార్చుకోలేను.

రామ; నీవిలా – నామాట వినకపోతే – నా ఆస్తిలో ఒక్క
సెంటుకూడా నీకు వచ్చేదిలేదు తెలిసిందా!

జగం: ఎందరినో ఎన్నో రకాలుగా ఏడ్పించి సంపాదించిన నీ
ఆస్తి–నీ సంపాదనా – నాకే మవసరంలేదు. నా తాత
సంపాదించిందేమైనా ఉంటే నాకిచ్చివెయ్యి.

రాము: ఇవ్వాలి వెధవకు? నిన్నసలు చదువుకోనీయడమే వచ్చింది వెధవ వేషాలకూ - వెధవ తిరుగుళ్ళకున్నూ. అమక్కుతింటూపోతావ్? జాగ్రత్త (అని కదలిపోవును)

జగం; నాన్నా! నీవుపెట్టే ప్రజాఘోషకు రాళ్ళుకూడా ద్రవిస్తున్నాయి. (వెళ్ళును)

[అస్థిమితంగా రామయ్య కూర్చుండును]

రామా; (ప్రవేశం) నమస్కారమండీ!

రాము; ఏంరా! రామం? చాలాకాలాని కనిపించావ్. తొందరేమీ లేవుగా?

రామా: లేకుంటాయా? అన్నీ తొందర్లే గాదండీ! వ్యవసాయ తరుణం వచ్చింది.

రాము; నీకేమైనా క్రొత్తఅప్పుకావాలా?

రామా; ఇంకా ముప్పు తెచ్చుకో దలచుకోలేదు లెండి.

రాము ఏమంటే యితరుల జోక్యం నీకెందుకులే?

రామా: వాళ్ళూ మాతోటి రైతులేగా?

రాము: భూమి బుట్టాలేనివాడు రైతెలాగోయ్!

రామా; ఉన్నభూములు, మీరైనా మన ప్రధానమంత్రి శ్రీ రాజగోపాలచార్యులవారు ప్రవేశపెట్టిన శాసనము మన ప్రాంతాలకు కూడా వర్తించి మీరు మేమూ - జుట్టు

పట్టులు పట్టుకోకముందే మన ప్రజా ప్రభుత్వాభిమతంగా భూస్వాములు మీరూ-రైతులమగు మేమూ ఒక ఒడంబడికకువచ్చి వ్యవసాయ ఫలితాన్ని యినుమడింపజేస్తేనే గాని దేశము సుభిక్షంగాదు. పేదరైతుల పై మీ దయాదాక్షిణ్యాలు లేకుంటే వీరంతా ఎలా బ్రతుకుతారు?

రామ: నీ దీర్ఘోపన్యాసాలూ - దయా దాక్షిణ్యాలూ - కట్టి పెట్టి నా మాటకూడా కాస్త విను రామూ!

రామూ: మీమాటలూ - మీయిష్టాన్ని - నిర్వర్తించడానికే గావచ్చింది మరి——

రామ: నా పొలంజేస్తూ నాయిష్టంగాకుండా చేదామనుకున్నారా ఏమిటి.

రామూ: అదెల్లా సంభవం?

రామ: సంభవమే - కాకుంటే - పదేళ్ళనుండీ పండించుకుంటున్నారు-లేవండిరా అంటే-; రంగయ్యా - అచ్చన్నా ఇస్మాయేలు ఏమేమో కూస్తున్నారటగా:- వారికి నీవేమో మద్దతు ఇస్తున్నావటగా;- నేనేమీ - యీ గ్రామంలో వుండద్దా ఏమిట్రా - రామం?

రామ: మీదయాదాక్షిణ్యాలుమీదే, గ్రామం-గ్రామస్తులూ ఆధారపడ్డారుగాని - వాళ్ళమీద మీరేమాధారపడ లేదుగా

రామ: మీ దయాదాక్షిణ్యాలమీదే నే నాధారపడ్డా

రామా: ఆ రకంగా ఆగ్రహించకండి. మీ ఒడిలో పెంచుతున్న బిడ్డల్లాగే — అందర్నీ చూడండి. తానున్న కొమ్మను నరుక్కోవడం తనకు మాత్రం శ్రేయస్సా తండ్రీ!

రామ: పొదుగుకోసి పాలు త్రాగాలనేకోర్కె బలిసిందిలేవోయ్

రామా: కాదు కాదు. దౌర్భాగ్యంకొద్దీ పడి-మిగిలే చేలకాశ వదల మంటున్నారే కాని-మరేం కాదు.

రామ: వాళ్ళెవ్వళ్ళైనా కదిలితేరాల్సిందే బలవంతంగా పోలీసుల్తో నెట్టించేస్తా.

రామా: అందాకా ఎందుకులెండి గోళ్ళతో పోయేదానికి గొడ్డళ్ళెందుకు? మూణ్ణాలుగేళ్ళైనా కవుళ్ళు వ్రాసియిస్తే నమ్మిచేసికొంటారు. అలా అయితే మీకిచ్చేది-మీకిచ్చి, వాళ్ళనుభవించేది వాళ్ళనుభవిస్తారు. అప్పుడు ప్రభుత్వ శాసనాలతో మనకే జోక్యముండదు.

రామ: గడియకొక శాసనం పుడుతున్నాయీరోజుల్లో, నేనా కాగితంమీద సంతకంపెట్టేది? వ్రాత బలికోరుతుంది. చేలల్లోంచి తొలగాల్సిందే!

రామా: తొలిగితే పడుగులే...?

రామ: కానచ్చు. ఆపత్పరిస్థితులు రానచ్చు. కాని జుట్టు చేతికిచ్చి గంతులు వేయడం నాపనికాదు. నీవకాల్తా చూస్తూంటే—నీకూ—వాళ్ళకూ దగ్గర సంబంధం

సన్నిసత్తుం దేమిటి? నాక్కూడ నాభూములేవి ఇవ్వాలను కోలేదు. ఇవ్వను.

రామా: పోనీండి. మీ అజమాయిషీ క్రింద భూమినంతా సమిష్టి గా చేయించి తీసికోదలచిన కట్టుబడి మీరే తీసుకొని తక్కువంది వాళ్ళక్కూడ క్రింద వదలివెయ్యండి. అందరికీ తృప్తిగాను ఉంటుంది. ఎక్కువ పంటకూ అవకాశం ఉంటుంది. ప్రభుత్వ కార్యక్రమంలో యీ రూపేణా పనిచేసినవాళ్ళమూ అవుతాం.

రామ: సమిష్టిలేదు. వ్యష్టిలేదు పాలాలేనాకుండా మీకుమ్ము డిమీద నా డబ్బుకూడాగుంజ నన్ను గుణ్ణం వెయ్యా లని చూస్తున్నారట్రా! అవేమీ నాకొద్దు. నీ వ్యవ న్యాసం కట్టిపెట్టి నేచెప్పేదివిను. ఏకసాలు కౌలుమా త్రంయిస్తా: అదికూడా కౌలు వ్రాసియివ్వను. అవన్నీ ఇప్పుడు చేస్తూన్నవాళ్ళకివ్వను. పండినా పండకున్నా కౌలుధాన్యం మొత్తానికి ఖరీదుకట్టి మూడువంతులు నగదురూపంగా ఇప్పుడే యిచ్చివేయాలి. ఇవిజరిగి క్రొత్తవాళ్ళయితేనే నాభూములిస్తా.

రామా: మీభూములపైనే మీకంత అవిశ్వాసమైతే డబ్బు ఇప్పుడెక్కడ తెచ్చిస్తాము? ఎవరిని కొదువబెట్టాలి?

రామ: డబ్బులేనివాడు వ్యాపారమెలా చేస్తాడోయ్! ఇది వ్యాపారంకాదా?

రామా; కాకేం! పెళ్ళాంమెడలోని పుస్తెతోగూడ వ్యవసా

యప్పు పెట్టుబళ్ళకు పెట్టిపొట్టకూడా చాలీచాలని పంట
చేసుకొనే వ్యవసాయంకూడా వ్యాపారమే.

రాము: నేచెప్పినట్టుగా జరక్కుంటే నా భూములివ్వను...

రామూ: నే...ను...ఇవ్వను. ఇవ్వను. ఎందుకిస్తారు? పండించి
కొట్లలో పోస్తున్నారుగా! గవ్వకూడాఖర్చులేక కాస్త
కూడా కాయకష్టం లేకుండా పండిస్తూంటే కుడిచి
కూర్చుండి చిన్నినాపొట్టకు శ్రీరామరక్ష అంటూ
బొజ్జలు త్రిప్పుకొనే ప్రభువులిస్తారా మరి-? శ్రీమాన్
ఆచార్యులవారి దయ అనేదే ఉంటే - మాకు మంచి
రోజులొస్తాయిలెండి,

రాము: కట్టిపెట్టు. అది అధిక ప్రసంగం.

రామూ: అలానే కన్పిస్తుంది. వందలాది యకరాల భూముల్ని
అమాయకపు ప్రజలు తమ రక్త మాంసాల్ని కరిగించి
పండించి తెచ్చి తమగాదెల్లో పోస్తూవుంటే నాది నాది
అంటూ కులికే ప్రభువులిస్తారామరి? ఎన్నాళ్ళీ నిరంకు
శత్వం?

రాము: ఛీ-ఛీ-ఛీ-నావద్ద యీ మాటలు సాగవు. చేయిస్తావా,
చెప్పినట్లు చేయించు. లేదా ఎల్లుండన్నీ జరుగుతాయి.
మీతండ్రి యివ్వాల్సిన బాకీ డిక్రీఅయ్యింది. మీ
కొంపా-గోడూ వేలంవేయించడమే తరువాయి యిక.
ఇక్కడ సాగవీయాటలు. పో పో. ఒరేయ్! గంగన్నా!
ఎక్కడచచ్చావురా! (ఉద్రిక్తుడగును)

రాము: ఒరబ్బీ! కిట్టిగా నామాట త్రోసిరాజంటూ యూనివర్స పూనకం వెనకేసుకొని తిరిగితే నా స్వార్జితంలో పైస దక్కేదంటూ ఉండదు. ఇంట్లోనుంచి కూడ త్రవ్వాల్సి వస్తుంది. ఇంటిగుట్టు లంకకుచేటన్నారబ్బీ! జాగ్రత్త!

జగం: నాన్నా! నీ హృదయంతో నేనేకీభవించలేను. ఈ కరువు రోజుల్లో-నమ్మకంగా పండుతున్నా పండించనీయకుండా అడుగడుక్కీ అడ్డుతగిలితే నీ స్వార్జితం నాకక్కర్లేదు. నా తాత మా అమ్మకిచ్చిన పొలంలో బంగారం పండిస్తాం. నేనూ వాళ్ళదగ్గరకే పోతున్నానంటే (అని వెళ్ళును)

క.గం: బాబూ! బాబూ!

రాము: తయారవుతాడు వెధవ! తెక్కెమంటూ — పిచ్చెక్కడ తగులడ్డాడో, కాస్త చూడరా!

క.గం: చిన్నబాబా! (వంగి-వంగి యుండును)

రాము; ఏమిటా అభినయం.

క.గం: అన్నీ ఖుద్దున చూచేసి తమకు మహాజరు నామనవి జేస్తాగా!

రాము; అన్నీ యేడిశావుగాని చక్కగా పొంచుండి కనిపెట్టు. ఆనాగయ్య కూతురొకతె పంపకమయ్యింది దగుల్బాజీ లాగా—చావరా_?

[ య వ ని క ]

రామ: ఓరబ్బీ! నీవిల్లా నామాట త్రోసిరాజంటూ యీ వెధవ మూకను వెనకేసుకొని తిరిగితే నాస్వార్జితంలో నీకు దక్కేదంటూ ఉండదు. ఇంట్లోనుంచికూడ త్రోయాల్సి వస్తుంది. ఇంటికొట్టు లంకకుచేటన్నారబ్బీ! జాగ్రత్త!

జగం: నాన్నా! నీహృదయంతో నేనేకీభవించలేను. ఈ కరువు రోజుల్లో-నమ్మకంగా పంటన్నా పండించనీయకుండా అడుగడుక్కీ అడ్డుతగిలే నీస్వభావం నాకు నచ్చదు. నా తాత మా అమ్మకిచ్చిన పొలంలో బంగారం పండిస్తాం. నేనూ వాళ్ళదగ్గరకే పోతున్నానులే (అని వెళ్ళును)

క.గం: బాబూ! బాబూ!

రామ: తయారయ్యాడు వెధవ! తెక్కేమంటూ—వీడెక్కడ తగులడ్డాడో, కాస్త చూడరా!

క.గం: చిన్నబాబా! (వంగి-వంగి యుండును)

రామ; ఏమిటా అభినయం.

క.గం: అన్నీ ఖుద్దున చూచేసి తమకు మహాజరుగా మనవి జేస్తాగా!

రామ; అన్నీ యేడిశావుగాని చెక్కగా పొంచుండి కనిపెట్టు. ఆనాగయ్య కూతురొకతె పంపకమయ్యింది దగుల్బాజీ లాగా—చావరా!

[ యవనిక ]

# పైడిగడ్డ

## మహా ఉప రంగం

[తెర ముందుగా రామానందం విషాదంతో వస్తుంటాడు]

౧

ఎండుగడ్డల – కోహోకి – మండు కొంప!
లవియ గొట్టంగ, నాగటినంట గట్టు
మక్కి – పెద్దాల నెన్ని – నే–దిక్కటంచు
పైడిపొలముల నిట్టోన్చు – బడుగు రైతు
పైన నిర్దయ జూపింత్రె? – అనఘులార!!

౨

కాడికట్టులబూన్చి – కడు బొములంబడి
లోకాలనే రైతు – సాకు గాదె?
ముప్పొద్దులోకాలు – భుజియింప పైగుడ్డ
బరచి, చేలంబండు – వాడు రైతు–
చలిచీమ మొదలు వి – శ్వం బంత నాగేటి
చాలులో బ్రతికించు – జంత రైతు–

రెక్కలన్నియు ముక్కలై - తొక్కబడఁగ
గాయకష్టమ్ము చేసి చీ - కాకుపడక -
లోకములదప్పి కష్టమ్ము - లోకటుమిగ్రింపు
బనుగు రైతింత, భారమై - పరగెనొక్క॥

అహర్నిశలూ రెక్కలు ముక్కలయ్యేటట్టు కష్టించే మా రైతాంగానికింకే అండా - దండా లేదా! పాపం కొండంత ఆశతో నాకొరకెదురుచూస్తూంటారు. వారిని కలిసి కోవాలి (వెళ్ళును) (తెర)

ఇస్మా: కన్నీ—రాకపోతే హేమీ సేస్తాన్ జేయా జాన్సక్!

అచ్చు: ఏంచేస్తాడా! చేల్లోనుంచి పొమ్మంటే ఏమిచేస్తావు నాయనా!

ఇస్మా: హెన్దావోంయ్, హింక్కీ వేసేది ఢేఢేంగా!

రంగ: ఒకేంయ్! మన తన్నులాటుంచుకురా! అబ్బాయి యింకా రానేలేదు. రాసిండి.

అచ్చు: ఏక్కడొస్తాడో! భూస్వామి మన మొఖమిన్నా కంటాడా?

ఇస్మా: హిస్సా ఏమున్నాడే! హింక్కీ!

అచ్చు; ఏంచేయాలో యేమో!

రంగ; అచ్చన్నా! తెక్కలు ముక్కలయ్యేట్టు యీ మండు టెంకలో పరాయివాడి భూమినమ్మి ఎంతకాలమిట్టా వెట్టిచాకిరీ సేస్తామోంయ్!

అచ్చు; చేస్తామే అనుకో, బకాయిపడితే పూచికపుల్లతోసహా వేలం వేయిస్తే బతికేదేంటోయ్! చూస్తూ - చూస్తూ యీ భూములన్నీ పోగొట్టుకొని మాన్నేతినమన్నా నట్రాం!

ఇస్మా: అరే! జేసరాక్షీ! ఫట్లల్లో పాటు ముక్కల్కీ ఖుదానక్కు ఏం
మంచి ఉపాయం తోస్తాందినా హై!

అచ్చు, ఎవరికీ దయలేకుంటే ఎల్లా ఏమౌతుంది. మనమిట్లా
నల్లుల్లాగా మాడి సావాల్సిందేనా?

రంగ: ప్రభుత్వానికి వాళ్ళేకావాలి. మనకూ వాళ్ళేకావా
లాయె అందుకని మనకీ భూస్వాముళ్ని కొలవడం
కంటే గతిలేదురా! కొల్చినా అనుగ్రహం కల్గాదే!

ఇస్మా: ఏనుక్కే హాంకుశంపోటు లెఖా హోగాయాహై!

అచ్చు; ఏం చేద్దాంరా!

ఇస్మా; ఓ కహో! భాయీ కహో!

రంగ; నాకోమంచి ఉపాయం తోస్తోందిరా! చింతగింజల గుజ్జ
మనిషికీ మాంమంచి సత్తు ఇత్తుందట్రా! అదితింటేసరి.

అచ్చు: ఓరదిగాదశా! అందుకే కామోశా! అడ్డమైనగడ్డి తిం
టానికి చెట్లు నాటిచ్చారు.

ఇస్మా: ఆ చెట్లందుక్కాదు జేసరాక్షీ! తిండిలేక సచ్చినోళ్ళ
పుల్లల్ కరువులేకుండా —

అచ్చు; ఏమనాన్నవో! ఏమో!

శామా; (ప్రవేశము) ఏమంటాను? వినేది లేదీ గొడవలు.
పో ఫో పొమ్మని ఒకటే కేకలాయె.

స్మా; అయితే హమీ సెయ్యాలాబేటా!

రామా: ఏంచేస్తాం దాదా! మన చాకిరీ మనకు తప్పదుగా!

ఇస్మా: ఉసికే బాత్

రామా; పండించడం బాబుగారికిష్టంకం

రంగ; ఆయనే చేయించుకొని మనకిస్తే బతుకుతాంగా!

రామా; చెప్పిన చాకిరీ చేస్తాంటే - పెట్టుబళ్ళెట్టి పండించాల్సిన అవసరమేముంది? కావాలంటే తక్కువకిస్తాడు కళ్లూ - వాకిలీ-అమ్మిస్తాడు. తీరదని భయముంటేగా

ఇస్మా; ఏసే హిమ్మా-హోతే, ఏం చేస్తాడు బేటా!

రామా; అతనికేం! కావలసినంత పండుతుంది లోకమంతా-అతని అడుగుజాడల్లో నడవాల్సిందేగా! ప్రభుత్వం - వారి తాబేదార్లూ - అందరూ - ఆయన్నారాధించవలసిందే ఏ శాసనమైనా అతనికొఱకే—

రంగ; అబ్బాయ్! ఇన్నేదో మనకనుకూలంగా - మనకే భయంలేకుండా-ప్రభుత్వం ఏదో-"ఇది" శాసనాన్నావదేంటో?

రామా; కూడూ - గుడ్డా - లేని, యీ బడుగు జనం చస్తేనే గాని అది అమల్లోకిరాదు చిన్నయ్యా?

ఆచ్చు: అంతేనా బాబు?

ఇస్మా; అసల్కీ బాత్, ఓక్యా హై బేటా?

రామా; దాదా! ఆ శాసనమొక్క తంజావూరు జిల్లాకే పని జేస్తుంది.

రంగ; మన కొట్టిదేనా?

రామా; మనకూ-వస్తుందంటారు. పదుగుర్లో పడేసరికి—

అచ్చు: పదిమందిలో పడ్డ పాము చావదు గామరి!

రామా: అదేకాదు. కళ్ళు విరక్కుండా-పాము చావకుండా ఉంటుందేమోఅని ఊహ

ఇన్స్పె: హాంటే—?

రామా: శ్రీరాజగోపాలాచార్యులవారైతే పీసమెత్తు సదుద్దేశ్యంతోనే చేస్తారు. చేసినా-ఆయన్ని పట్టుకు పీడించే స్వార్థపరు లెందరుంటారు, దానిలో మార్పులు చేయించడానికి దాదా!

అచ్చు; మనకు రాదన్న మాటే.

రామా: మనదౌర్భాగ్యమంతా మనమనుభవించి పడరాని బాధలన్నీ పడ్డాక - ఎప్పుడో వస్తుంది —

టికే వానికెంతో కన్నెఱ్ఱగావుంది. అతన్ని వెన్నంటి యున్న ప్రభుత్వమే యిప్పుడాతని కంగరక్ష. అదికాదు దాదా! ఎవరు లెక్కలు వారు-డొక్కలో పెట్టుకొని దాచుకుంటు యీగ్రామముల్లో - యీపైడిగడ్డల్లో-దాని నెత్తినమంతా ఏమందనో ఆలోచించారా! మనమూ—మన జిల్లా జిల్లా-ఈసుగాలం భూమికెల రగదీస్తే నేగాని-వీరిపా లిగింపులు వీరికి రావడం లేదు. కష్టించక వచ్చిన భాగ్యంతో పేర్-మేడలూ-మిద్దెలూ కట్టిసలుకుతు న్నారే గాని-రైతులోకం విరసమైనరోజున ప్రపంచ మెంత అధోగతిలో పొజలాడుతుందో - ఎట్టి విప్లవ బీజాల్ని సంతుష్ట భూస్వాములు తీసుకొస్తున్నారో, ఆలోచించడంలేదు దేశంలో-ప్రతివాడూ-తినవలసిందే బ్రతుకవలసిందే - అన్న సూత్రాన్ని - ధర్మాన్ని న్యాయాన్ని-పూర్తిగా విస్మరించిన వీరిని మనమే మన్నా? ప్రయోజనం లేదు.

౧

మండుటెండల రక్తమ్ము - బిండి గడ్డ
గడ్డకుంబుట్టెడు జలమ్ము - గాగఁగ్రోలి,
హాల ముఖమ్మున భూమినిం - తెలుగ దున్ని-
కట్టెముల నుండు రైతుల - పొట్టఁగొడు దే?—

౨

తెలతెల వేగునంత చలి దింభుజయించి భుజాగ్రపీఠినా
గవిసెలకోల చేతములు, గజ్జియుబగ్గము దాల్చి వెంకిగం
టలతన కోడెమాడల మెడల్ గికురింపగ క్షేత్రలక్ష్మికిం
పులు గదయింప హాలికులు, బోఫుట కంటెను భాగ్య
మున్న దే

తొలికాపువాసతో - మొలిచిన నివ్వరి
పైరు చావగ మన్ని - పదును జేసి—
చిదుము బట్టినరీతి చిగురించు చెంగల్వ—
కలుపూడ బెరికి గట్టులను చేర్చి
ఎగుమూపు తీరన నెదిగిన గటుల
వెలి, పైననురుకు శం - కలను నరికి—

పైరులన్ని బెట్టి - పంటలఁ - బండఁజూచి
కోసి కుప్పలఁ జేరిచి - కొలచు నూర్చి—
తెచ్చి లోకాల కాకల - తీర్పజాచు
రైతుపైనింత జుల్మివి - ధింతే, తండ్రి!— (వెళ్ళును)

* * * *

(సమయం: సాయంత్రం ఫారంహౌసు గొడ్లకు పచ్చ మేతవేస్తూ - విశాలాక్షి పాటపాడుచుండును. దూరంగా జగం వస్తూంటాడు.

పాట

కదలి "రావోయి నాకనకాంపు కోడెకాడా"
కదలరా! ||కద||

జలజలా సెలయేళ్ళు—
పొలములోనికి కెనోయ్—
కడలన్ని చల్లనై
మడిమున్న వేళాయె ||కద||

తొంగితొంగి లకరి చూచె
నింగిమబ్బులు క్రమ్మె
కావేరీ కడవెల్ల
క్రమ్ముకొన్నాదోయి ||కద||

జగం: జీవనదులన్ని యీ
త్రోవలో కలిసాయి
మచ్చికై నా ప్రక్క
గుక్క త్రోవగరాదా ||కద||

(విశాల కనులుమూయును)

విశాల: (సవికాసంగా) జగం! యిది అసమయం.

జగం: విశాలా! మనిద్దరలోగూడ అరమరి కాలున్నవా!

విశాల: ఇదిగో! ఆగాగు

జగం: మానాన్నొస్తాడు కాబోలు

జగం; పోవేరా వెధవా పో

విశాల: రా జగం. యింకయీ పందెంలో ఏముంటిగాని

(గంగన్న పరుగెత్తును జగం నిర్వారంతో నిల్చుండును)

విశాల; ఏం జగం అల్లానిల్చున్నావే

జగం: ఎల్లా నిల్చున్నాను?

విశాల: భయపడుతున్నావే!

జగం: వాళ్లేవిశాలా

విశాల: అన్నీచాలిస్తే నీకీవిచారమేవుండదుగా

జగం: ఏమిటన్నీ

విశాల: ఏముంటుంది? నేనే కారణమనుకుంటూ

జగం: విశాలా నన్ను భాదించకు.

విశాల: అ...ది...గో...లక్షలకు లక్షల కట్నాలొస్తాంటే
కాదని కాలతో నేవారుంటారా జగం!

జగం: ఉన్నదిచాలక ఊగులాడే వున్మత్తుణ్ణి కాను. నన్న
లాఅనుకోకు.

విశాల! ఎల్లా అనుకోవాలి!

జగం: కాకుంటే: కలిగిన భాగ్యం కాస్తయినా: కడకు విడల్చ
లేని కాకి బ్రతుకెందుకు విశాలా?

విశాల: అందుకు నీవేంచేస్తావు జగం? నీ తండ్రి ననాలి గాని నిన్నేవరంటారు?

జగం; ఆ తండ్రి కొడుకుననాల్సిన పనేలేదా? (తలవాల్చును)

విశాల: ఎందుకీ విచారం జగం.

జగం: ప్రకృతి భిన్నంగా మానవుడెలా వ్యవహరిస్తాడు? మా స్థితి రైతుల ఘోషా-చూస్తూంటే నాకేమి అర్థం కావటం లేదు. విశాలా?

విశాల: పెద్దవాళ్లున్నారుగా మనకీ గోలెందుకులే జగం?

జగం: వివాహనిబంధనాల్ని కాంక్షిస్తూన్న మనకీ విశ్వంలో స్థానం లేదా?

విశాల: తొందరపడుచున్నావు జగం?

జగం: నాకైతే-పెళ్ళికీ-ప్రేమకీ జాతీ రాంపత్యానికీ - సంబంధమేమిటో తెలుసుగాని-లోకమల్లా కాదుగా విశాలా?

విశాల: జగం? మరేం లేదుగాని—

జగం: మీనాన్నారుకోడు ... అంతేగా?

విశాల: ఎందుగ్గాని పైగా మీనాన్నకు నేనేవిధంగా-నా మోహం చూపించాలి,

జగం: వస్తా విశాలా?

విశాల: పాలుతెస్తానాగు (తాగొచ్చు—

జగం: నవ్వుతే (తెచ్చియివ్వగా జగం త్రాగుచుండును

(రామానందం రైతులు వస్తారు. జగం విశాల వాకిట్లో చేరుదురు.)

తస్మా: అయితే-హేమ్టి చెయ్యాలా శేటూ?

రామా: ఏంచేస్తాంబాదా? మనచాకిరీ మనకు తప్పదుగా?

తస్మా: ఉస్ కే బాద్

రామా: పండించడం. బాబుగారి కివ్వడం—

రంగ: ఆయనే చేయించుకుని, మనకిస్తే బ్రతుకుతాంగా

రామా: చెప్పని చాకిరీ చేస్తాంటే-కష్టబడిపెట్టి పండిచాల్సి నఅవసరమేముంది కావలంటే అప్పుచేస్తాడు. ఇల్లు వాకిళ్లు అమ్మిస్తాడు తీరదనిభయముంటేగా

తస్మా: ఏదీహేమ్యా-పోతే ఏంచేస్తాడు శేటూ?

రామా: అతనికేం కావలసంత వుంగుంది లోకమంతా-అతని అనుగు జాడల్లో నడవాల్సిందేగా-ప్రభుత్వం-వారివారి తాబేదార్లూ అందరూ ఆయన్నారాధించాల్సిందేగా. అందరూ చూడాలి కూడా గుడ్డలేని యాచకుడు జను-లెల్లాచస్తే అతనికేం? ఈస్థితిలో మనమాటలినే మా రాజుంటాడా నాయనలారా, తెలివితక్కువ—

అచ్చు: అదేదో అర్థమయిందిగా (ఏడుపు)

రామా: ఇంకేం? ఈ నిరంకుశత్వానికున్న హద్దులూ-అతిక్రమంగా రెండూ మనకు తెలుసుగా. కాఠిన్యమింతగా గడ్డకట్టి-అతని రూపంగా తయారయిందే కాని సామాన్యంకాదు. ప్రచ్ఛన్నను దగ్గరకు తీసి తంత్రీ విచారించకు నమ్మకోనియున్న వృత్తిగనుకనూ - చేతనయిన వ్యవసాయము గనుక - మనమీ కైతాంగాన్ని-అంటి పెంటుకొన్నామేగాని, మానవ్రనకు చేతగాని దంటూ ఏమి-ఉండదు. అల్లాజరిగిన నాడీ భూస్వాములూ ప్రజాసమూహామూ - ఆహార లోపానికటమటించి నల్లుల్లాగామాడి చావాలిసిందే

ఇస్మా: క్యాకరే బేటా.

రంగ: అర్ధాకలితో - పెళ్లాం బిడ్డలు-అఘోరిస్తూంటే-ఏంచేయాలి నాయనా?——

ఇస్మా: ఖేత్ మే బైఠాయి స్తేసరి హేమ్మిాసేస్తాడ్ హేడ్కీ హూక్టు పేసేదీ యేంటీ బేటా?

రామా: ఒక్కటే మాకాదు. దాదా! అతని వెనుక కావలసినంత పశుబలముంది. మనఐక్యతచూచి వాని కిప్పటికే కన్నెర్రగావుంది. ప్రభుత్వమే వూరుకోదు అతని వెన్నంటియున్న ప్రభుత్వమే అతని కంగరక్షు.

(నాగయ్య ప్రవేశం)

నాగ: అదంత తేలికయిన పనిగాదు నాయనా?

అచ్చు: మీరెప్పుడూ ఇల్లాగే చెప్తుంటారు. కడుపుమాడి-గంజ కూడా దొరక్క-చస్తూంటే ఏంచెయ్యాలన్నయ్యా!

నాగ; పరిస్థితులన్నీ తెలుసు తొందరపడకండి నాయనా!

ఇస్మా: గంజిదొరక్కపోతే మన్నే తిన్నా మన్నే తాగిన సత్తె సరి ఇస్ జనాక్యాకహే నాగయ్య బాభూ!

రామా: దౌర్జన్యం - దుర్మార్గం - తాండవిస్తోన్న ఈసంఘం లో ప్రజాయంత్రాన్ని భగ్నంచేయక తప్పదు. ప్రభుత్వ యంత్రం-ప్రజాజీవనం-రెండూ-సమకోణంలో నడచినప్పుడే ప్రజాశాంతి వేయి వేయి పంతల్లో నడిచే యీ శాసనాధికారం పగులగొట్టక తప్పదు నాన్నా! ప్రజావిప్లవం రేగిన నాడు, వ్యక్తులం మనమేంచేయలేం అడ్డుకోనలేం కానీ

జగం: బావా! యింత అశాంతి రేగిన ఈసంఘానికిక ప్రశాంతి లేదా ఎందుకీకలహం ఆ పందెకరాలు-సమిష్టిగా-మన మంతా పండిద్దాం నేనూ-మీఫాదానికే వచ్చిపనిలో పాల్గొంటాను. మాధుర్యంలేని ఈ జీవనంలో-మరచి పడుండేకంటె కాలుష్యమైన ఈ జీవనాన్నింతటితో కడిగి వేయటం మంచిది—

రామా: జగం! ఆపందెకరాలూ-కూడా తనయాజమాన్యంలోని దేనట తొలక్కపోతే పశుబలాన్ని ప్రయోగించి స్వాధీనంచేసుకుంటాడట అదీ-అయింది జగం?

జగం: దాని నాపటాని కెవరకూ శక్యంకాదు. రండి
(కదలుచూ ఉద్రేకంగా అందరూ "జయ జయ--ధ్వానాలూచేస్తూ జగాన్ని కౌగలించుకుంటూ వెళ్ళిపోతారు)

రామయ్యా-గంగన్నా-అమీనా-సెట్టీ చూస్తూవస్తారు.

రామ; (చూచి) గంగన్నా! ఆహా పంతందనాలు తొక్కుతున్నారురా

క.గం: కడుపులు మాడ్తూవున్నా యంటారు. గంతులుమాత్రం తగ్గించరు.

రామ: అసలీ జాతి డొక్కలు మాడిస్తేనే గాని-బుద్ధి రాదురా నీకేం తెలుసు! (చూచి) ఓరేయ్! వీడూ ఇక్కడే పడ్డాడ్రా

క.గం: ఎవరండీ

రామ; మనవాడేరా జగం

క.గం: ఆయనేంచేశాడు లెండి.

రామ; తగులడనీ (నాగయ్య-విశాలా-జగం-ఇంట్లోకెళ్ళు మను తక్కిన వాళ్ళు వెళ్ళుదురు)

నాగ; యీపంటలు రానియ్యండి బాబూ

జగం; పాపం! చాలనమ్మకం. యిచ్చాక రెండుపంటలు జరిగినై చాలా యిచ్చాడు.

నాగ; మాకూ-పశువు ప్రతిష్టలున్నై తెచ్చిన-చోట ఇవ్వాలనే జ్ఞానమూవుంది గంగన్నా?

రామ; చాలజ్ఞానముంది. ఉన్నవాడవిల్లా. యీజనాన్నంతా చెప్పి యీరభసేమిటి?

నాగ; మేమేం రభసచేశాం? మాతోటిరైతులు ఏవో కష్ట సుఖాలు చెప్పుకుంటున్నారు. అంతే బాబూ—

రామ; మమ్మల్ని వూళ్ళోనుంచి లేవగొట్టాలనేగా! మీఅలోచన దిక్కుమాలిన ముండాకొడుకుల్తోచేరి కొంపకు నిప్పంటించుకుంటావా నాగన్న

రామ; నీవు చేయలేదు. మాసొమ్ములాక్తే

నాగ; ఆగండి పంటల్లో యిస్తాం.

రామ; ఇంకా-యిస్తావా? ఏయ్? అమరయ్యా! తాళంవెయ్యి పాడినవాళ్ళ కప్పగించు.

నాగ; పిల్లా? మాకేమీ తెలియకుండా కోర్టుంటుందా

రామ; ఏం తెలియాలి ఒరేయి గంగన్నా? ఈ అమీనాను తీసు
కెళ్ళి-బయటిగ్గెంటి తాళాం వెయ్యి పోయ్

(గంగన్న కదులును)

నాగ; ఒరేయ్ గంగన్నా? జాగ్రత్తగా లోచించి అడుగు వెయ్యి
కడుపులు కాల్చుడండాండా కొంపలక్కూడా తాళాలా

రామ; ఏయ్ నాగన్నా! శృతిమించిరాగానపడుతోంది. ఆగ
మన్నాం. అలాయితే యిచ్చి వెయ్యి.

నాగ; యింతదుర్మార్గంచేసి-పరువు, ప్రతిష్టలు నీపొట్టన పెట్టు
కొని బయటిగ్గెంటిస్తావా?

రామ: రాకోయ్ బయటికిగా? శెట్టిగారూ? ఇదిమీరుపొందండి
ఇంట్లోవున్నసామానుతోసహా స్వాధీనము

నాగ: శెట్టిగారు రైతుకున్న బొచ్చి-బోలీ-మీకేమక్కరకు
వస్తాయ్?

రామ: కాదులేవయ్యా? పిల్లా - జల్లాతో ఉన్న కొంపేలే నగా
నట్రాసీ సొమ్ముప్రాదుతుందిలే. ఊ

(అని అమీనాను సన్న చేయును)

జగం: (లోనుండివచ్చి) నాన్నా? యింత దుర్మార్గం దౌర్జన్యం
రైతులమీదచేయించుట న్యాయంకాదు. మామయ్యా
నీదంతాపిచ్చికాని-ఇంకా యీ ఊరు నిన్నుద్ధరిస్తాం

కదా నీ ఊహ. ఫారంలోకే వెళ్ళి బ్రతుకవచ్చంటే వినావా? ఇప్పటికైనావచ్చి వెయ్యి? ఆయనికంతా తలపెట్టుకొని యేలతాడులే రండి

రామ: ఒరేయ్? జగం? నీవీస్థానంలోతప్పుకో ఇంటికిపద. తండ్రి కొడుకులు తగాదాపడ్డారంటే తప్పకాదటా?

జగం: తప్పులు తెలిసే ధర్మంచేస్తూన్నావ్ పాపం. ఇంకాతండ్రి బిడ్డల సంబంధం తలవడ మెందుకులే విశాలా? నువిల్లా బయటికిరా ఫారంలోకే పోదాం రా

విశాల: క్షుద్రంగా మమ్మల్నందరిని తరిమి రాక్షస రాజ్యం చెయ్యి.

జగం: నాన్నా? క్షేమంతాకలసే పోతాంలే
(దూరంగా నిల్చుందురు.)

రామ: తిరుగు తిరుగు వెధవ నీచంగా?

జగం; నీవేదాని కొడిగట్టావు?

రామ: ఈ భూములన్ని మాన్యాలుగా వ్రాసియిచ్చి—యీఅగ్ర జనాన్నంతా మేపుతానట్టా

జగం; మామయ్యా! బయటికివచ్చి వెయ్యి ఆయనీ నిరుపేద రైతులనందర్నీ యేడ్పించి బయటికిగెంటి యీవల్లకాళ్ళో రాజ్యం చేస్తాడులే రండిపోదాం

నాగ, నాయినా—శాంతించు—పరువు ప్రతిష్టా—ఏనాడో మంట గలిశాయి. అన్యాయంగా—అక్రమంగా—పంటలకాశిం

రైతాంగపు అప్పుల్ని సాకుజేసి యీ జిల్లా జిల్లాలో
నున్న మమ్మల్నందర్నీ నిరాశ్రయుల్ని జేసి మాకింక
గూడా అమ్మించి రాక్షసత్వానికి పాల్పడ్డ-నీశాసనా
న్నెదిరించకుంటే నాతోబాటింకెందరో భావియుగంలో
నీదౌర్జన్యానికి గురికావలసి వస్తుంది. రానీ, నీమారణా
స్త్రం ఏది? (అని గుమ్మందగ్గఱ నిల్చుండును)

రామ; ఊఁ (సంజ్ఞచేయగా-అమీనా-గంగన్నా-ఆత్రంగా వెళ్ళి
దురు నాగయ్యచెయ్యి పట్టుకుందురు)

నాగ; (తీవ్రంగా) మర్మాత్ములారా? రండి మీ ప్రాణాలు బలి
గాకుండా నాయింటిని స్వాధీనం చేసుకోలేరు?

రామ; ప్రభుత్వశాసనానికే తిరస్కారమా? (యింతలో రైతు
లూ రామానందం వస్తారు.)

రామా; ఎక్కడి ప్రభుత్వమిది! నాన్నా? ఈవలకు వచ్చి వెయ్యి
కూడూ-గుడ్డ యిల్లు ఇవ్వలేక ఎన్నోవంకలదారుల
నాశ్రయించే యీప్రభుత్వానికీభూస్వాములకూ దయా
దాక్షిణ్యాలుండవు నాన్నా? యువతలకురా?

(గంగన్నా-అమీనా-నాగయ్యను మెడబట్టి యువతలకు
సాగుదురు తాళం వేయుదురు)

నాగ; బాబూ? మమ్మల్నిల్లా నిరాశ్రయులజేసి పరువు ప్రతిష్ట
లన్ని-మంటగలిపే యీ [illegible] వుండదేము
ఈకాడి క్రియలేనమ్మితే కరువుగాదులే పోతాం బాబూ

పోతాం మాకిన్నాళ్ళూ ఆశ్రయమిచ్చిన యీ గృహానికే మా జోహార్లు

జ: నాన్నా వక్షంమీద నాలంగానా తెచ్చుకొంటూ (అని వెళ్తూంటగా-అమానవహదారియును "నాన్నా" అని వడును అందరు వ్రదేశం-కన్నీరు, రామయ్య-గంగన్నా అవినా వెళ్ళుదురు రైతులంతా జగం-విశాలాక్షి. నాగయ్యలకు చుట్టూముట్టి కన్నీరు గార్చుచుందురు)

గా: నాన్నా పెద్దవాడవు నీవే యిల్లా అధైర్యపడితే మేమేం చెయ్యాలి కృషితో నాస్తి దుర్భిక్షం. నాయినలారా యీ గ్రామం మనల్ని ఉద్ధరించదు మనమందరం మన పొలాలమీది పాకల్లోనే-ఉంటూ-అక్కడి భూమినంతా పుమ్మడి పొలంగా జేసికొని పండిద్దాం ఆహారమంతటికే మన "జగాన్ని అధ్యక్షునిగా జేద్దాం. ఈనాటి నుండే మనమంతా ఏకకుటుంబం ఒకేస్థాయిలో జీవన ప్రమాణాన్ని సవరించుకొంటూ ప్రపంచ పురోగతికే నవసమాజ నిర్మాణానికీ దారితీసిన నవచైతన్యం కల్గించాలి రండి నాయినా రండు.

(అంతా ప్రదేశానికి నమస్కరిస్తూ వెళ్ళుదురు జయ నినాదాలు)

(లోనపాట)

నవభారత చైతన్యం
యువజీవి? మనసై తేనోయ్ ||నవ||
కష్టసుఖాలూ-కావిడికడవల —
గతియేయని నమ్మగదోయీ? ||నవ||
పంటభూములూ-పైడిముద్దలూ పండించే
మికపదదోయ్ ||నవ||

# పైడిగడ్డ

## నాలుగో రంగం

(సాయంత్రం మూడుగంటలవేళ మధ్యాహ్న భోజనానికి వచ్చి వెళ్తున్న రైతులూ - ఫారం పాకలూ - రైతులు కాన్పిస్తూవుంటాయి "సమిష్టి వ్యవసాయక్షేత్రం" అనే బోర్డు కాన్పిస్తూంటుంది మధ్యాహ్న భోజనసమయ సూచికా ఘంటలు మ్రోగుతుంటై చీరచెరుగుతో నడుంబిగించి రేగుతూన్న తలవెంట్రుకలతో కొడవలి చేతబట్టికొని-పంటచేలవంక జూస్తూ ఉత్సాహంగా "విశాలాక్షి" పాడుచుండును)

పాట

గోలపండివ్రాలుచూ—
వరిచేల కులికేటి—
పంటమాలచ్చిమీ! రావమ్మా!
ఒయ్యార మొలికింతువా పైనా
సంక్రాన్తి వేళల్ల—
చల్దిబువ్వాలతో—
గొబ్బెమ్మకూ-నిత్య—

నైవేద్య మీయంగ—
కొంగ్రొత్త పాయసము—
వండిపెట్టాలమ్మ! రావమ్మ ||గో||

పచ్చన్ని చేనులో—
పైరుగాలీలో—
పదంపాడుతూ—బావయ్య!
భావగీతాలల్లుకొందామా ||గో||

(జగం ప్రవేశించి, విశాలకన్నులు మూసివేయును)

"ప్రేమనౌకకు జుక్కాని – నీవుకాదా?"

(కనులుమూయును)

విశాల: ఆగాగు జగం!

జగం: ఏమంత తొందర!

విశాల: ప్రకృతిలో తొందర పడనిదొక్క— అనైక్య స్వరూపమే జగం!

జగం: పరిణామాలు చెప్తున్నావా, విశాలా?

విశాల: కాకుంటే, నీవేనాడైన ఇన్ని కష్టాలెరిగియున్నావా?

జగం; కష్టమేముంది?

విశాల: కష్టాన్ని కూడ మరచిపోయి కాలాన్ని కనుక్కున్నా వన్నమాట

జగం; ఇందతా కొత్తకాలం, క్రొత్తలోకం విశాలా!

విశాల; కష్టకాలం, కష్టలోకం కదూ?

జగం; ఇదొక దివ్యలోకం, సుఖమయ జీవనం

విశాల; ఎల్లా

జగం; ఒకరిపై నాధారపడకుండా—సర్వం మనమే చూచుకుంటూ—జీవయాత్ర సాగించటమెంత ముదావహం! విశాలా?

విశాల: అలవాటులేని యావేశము.

జగం: అమృతతుల్యమైన యీజీవితంలో – ఆనందానికి హద్దుల్లేవు.

విశాల: జగం! ఈ ఆనంద నందనంలో నీవునాజీవితవసంతానికి కోకకోయిలవు

జగం: నీవూ—నాకొక శారికవేగా!

విశాల: ఔనౌను. ఈ శుక—పిక—శారికాకలాపాల్లో–ఉన్న సౌజన్య మేమిటో?

జగం: అంతకుమించిన యీపొలాలూ–యీరైతాంగము—పనిపాటలు—తనివితీరని ఆనందస్థానాలు కానావిశాలా

విశాల: జగం! నాకోమలమానసంలో నీవు నాకొక నౌకవు.

జగం: విశాలా! నాకు నీవూ–అంతేగా! ప్రకృతిభిన్నమైన చైతన్యం మనయుభయుల్లోనూ–ఉంటుంది.

విశాల: ఆ… …హా…! జగం! ఆగర్భ శ్రీమంతుడవైన నీవీ పొలం గట్టుపై–నాతో కష్టాలనుభవిస్తున్నావంటే నాకే విచారంగాఉంది.

జగం: నీమధుర మానసం–సాంఘిక జీవనమూ–రెండూ కలిసి నాకొక చక్కని బాటచూపించినై, విశాల! నీజీవితము విశాలం ప్రజాసేవ నలవరచిన నీకు–నాకృతజ్ఞత నేవిధంగా చెల్లించాలి!

విశాల: జగం, ఈ సంఘంకన్నెజ్జితో మనప్రేమకే విఘాతమూ కాదుగదా!

జగం: అదెల్లా సంభవం?

విశాల: ప్రకోపించు అగ్నిపర్వతం నిప్పులుగ్రక్కడం సహజం కదూ!

జగం, మనమూ—మన ఘారమూ—మన రైతులు—అందర ఆక్కు—లక్ష్యమూ—ఇదే మనలోకం చేసికొంటా భయమేముంది?

విశాల: శ్రే...దా...!...సరేనా (దగ్గరకు వచ్చును)

జగం: ఆతుఫానులో మనము పడవలసిన పనేలేదు. నీకాభయ మనవసరం. సరేనా?

విశాల: అల్లాగేకాని, యిల్లాచూడు జగం! ఈ పంటచేని సౌభాగ్యం?

జగం: నిండుచూలాలివలె జవ్వన వంగింది కదూ!

విశాల; అలసిపోయిన అయ్యల్లాగా పారుకాడడం లేదుగదా!

జగం: అంత కోపమెందుకు విశాల! (బుగ్గగిల్లును)

విశాల: జగం! ఈ ప్రాంతం నిరుడు మనమంతా చూచాం దుబ్బా-దుమ్ముటాతో ఇదెంపండుతుందను కొనేవాళ్ళం కదూ!

జగం: బాగుజేసే పైడిబాబులేని నాటి స్వర్గరూపమీవేళ ఎల్లాకాన్పిస్తుంది?

విశాల; ప్రకృతంతా అంతే

జగం: అంతేగా మరి! (విలాసం)

విశాల: నవ్వుతావెందుకు? చాల్లే జగం! నువ్వొస్తే— ... ...
(కినియును)

జగం: విశాల! అప్పుడే ఇరవైయెకరాలు కోతలయ్యిపోయింది. ఈ వేళ రైతులిన్ని—మీ దాదా కడుపు చెక్కలయ్యేట్టు నవ్వించాడు. ఎంతహుషారుగా ఉన్నయ్యనుకున్నావీ వేళ కోతలు!

విశాల; దాదా కేంపనుంది? నవ్విస్తాడు-పనిపాటలు మరిపించి పాటలుకూడా పాడిస్తాడు.

జగం: అదుగో! రంగయ్యా-అచ్చన్నా ఇస్మాయేలు-భోజనానికి వస్తూనే ఉన్నారు మీ దాదాపరిహాసం పూర్తవ్వు గాని, యిల్లాప్రక్క నేదాక్కుందాంరా! (అని ప్రక్కన నిల్చుందురు)

అచ్చు: చెప్పరా, నాయనా! చంపక

ఇస్మా: చచ్చేది హాక్టీరోజే - చీట్కీ - మాట్కీ-సస్తార్ జే! అంతా తోల్యా హెల్లి - కరువురోజుల్లో - కడుపు నిండా తినేద్దాం జల్సాసేసేద్దాం బిరియానీ ఐమిలేద్దాం వారేవా! వారే-హుస్త్రామాకి హాక్టీపకా (అని చిందులు తొక్కుచుండును)

(విశాల వచ్చును)

విశాల: (చెవిప్పుచ్చుకొని) సరేకాని దాదా! రామయ్యగారు అటకాయిస్తే ఏంచేద్దాం!

ఇస్మా: హేమ్టి సేస్తాం సస్తాం-అనేదో! (పంచె పైకికట్టును)

రంగ: కరువురోజుల్లో యీకాసినిగింజలు లేకుంటే--కడుపులు మాడి చావమూ! —

అచ్చు: చచ్చినా జాలెవరికిరా!

ఇస్మా: అసల్కి హిచ్చేదేలేదు హేమ్టి సెత్తార్!

రామా: ఈయనవసరంలేదు దాదా! ఇదిగో మనచిన్నబాబీ పొలాన్నంతా కలసి ఖండించమన్నాడుగా! భయం లేదు

అచ్చు: మా మంచి మారాజురా!

ఇస్మా: నేనీవాడుండొద్దా తరాజులందరికీ

జగం: (ప్రవేశించి) బావా! ఏమిటి పీరంతా! కొంతమంది కాడీముకాల్ని తీసికొని-నాన్ని వేళ కోతలుదగ్గర గల్లంతుచేసి-అటకాయించాలని చూస్తూ-వస్తూన్నాట్ట అందరమూ అక్కడకే వెళ్దాం, పదండి

ఇస్మా: హేష్లా హోస్తాడ్? రాసీ—!

(ఉద్రేకంగా అందరూ లేతురు.)

అచ్చు: భూములు మీవి. స్వాములు మీరు పొమ్మంటే పోకేంజేస్తాం పోయిన సాలుతీసికొన్నట్లే-యీసాలు తీసికోండి ఇయ్యేటితో మీబకాయిలన్నీ తీర్తాయి, అందరమూకలిసి ఉమ్మడిగా ఇదంతా చేసికొంటూన్నాం మిగిత్తే బ్రతుకుతాం బాబూ (అనికాళ్ళపై మోకరిల్లును)

ఇస్మా: అసల్ ఈ కామ్ మనం సేస్తుండా? యేసబ్ ఆద్మిమో కీసూసీఘు బ్రా పడ్డార్ మహారాజ్ అదిసె త్తేనే

రామ: మీ రెందరేడిస్తే - నన్నేం జేస్తారుగాని - సమిష్టిగా యీపొలం మీరంతా చేసి ఏదైనా మాటమాటవస్తే పైబడి కొడదామనుకొన్నారు కాదూ?

రామూ: అశాంతికారణం మేంకాదు. దయాదాక్షిణ్యాలు లే
కుండా—పండినపంటంతా గాదెలకెక్కించి బడుగురై
తులు "అన్నమో రామచంద్రా" అని ఆఘోషిస్తున్నా
కడిగినముత్యంలా కూర్చుండి – ప్రతివాడు తినవలసిందే
జీవించవలసిందే అన్నసూత్రాన్ని మరచిన మీరే
అశాంతికారకులు ఎవడికి కడుపు మాడితే వాడే ఘోషి
స్తాడు ఆఘోషకారకులెవరో వారే అశాంతికికా
రకులు ప్రజాక్షోభకూ_విప్లవానికీ – గింజరాల్చివేసిన
వారౌతున్నారు హృదయం మార్చుకోనపుంటే ప్రజా
యంత్రాన్ని ప్రజా ప్రభుత్వాన్ని పునాదులతో కదిలిం
చిన వారౌతారు.

రాము: ఏదేశంలో—ఏప్రాంతంలో-భూస్వామ్య సంస్కరణాలు
జరుగుటలేదో కనువిప్పిచూడండి (రామయ్య కనులప్ప
గించి వెర్రిగా చూస్తూండగా "కాశ్మీరు నైజము"
అన్న అక్షరాలున్నబోర్డు రంగ మధ్యంగా వ[illegible]ంది)

రామూ: అయిందా ఉపన్యాసం? యీ అఘాయిత్యాన్నీ-యీ
దుర్మార్గసంస్కరణల్నీ—చూస్తూ—చూస్తూ నేను చేయను
లేను. వదలి పూరుకోను లేను ఏదీ? ఒక్క అడుగు వేశా
రో తుదిచూడాల్సి వస్తూంది (అని చేతుల్లో కొడ
వళ్ళు లాగును)

రైతులు: కోయండిరా ఊఁ? చెప్పినావినని మొరటోణ్ణి విప్పిం
చడం కష్టంరా?

రామ: ఊఁ... ...ఊఁ... ... వెనక్కి

ఇస్మా: దేఖోబాఘూర్-సోచో...

రామ: ఏంచేస్తావేంటి యిస్మాయిల్?

ఇస్మా: హేంస్త్రా సేస్తాం? ఉస్కీ బాద్ హేష్టిగా నిద్యాలో హదే

రామ: ఇస్మాయిల్! ఏమైనా పొగరు తలకెక్కిందా యేమిటి? ఏంచేస్తావు పార్శ్యాగృహ ముండాకొడకా. (అని కాలు చెప్పు విసురును)

రామా: అ... అ... బాబూ? అదివట్టి నిరంకుశం అతనేమైన అంటే మేం మందలించగ?... ...

రామా: ఆ... అ... నాయన లారా! శాంతించండి దుర్మార్గం లోకాదిభూస్వాముల మతిచెరిచేది జరిగినదానికి విచారించకు

ఇస్మా: అరెరె... మాకే... జూ... త్

రామా: శాంతించు (అని దగ్గఱకు తీయును)

ఇస్మా: హేట్రిమాష్యాంతం? గాంధీగారితో ఛే ష్యాంత కస్తే కాఘ్యా హెచ్చాంయ్ బాబా? ఉస్కీ బాద్ మారనోం కామార్ నాయేబాబా?

విశాల: ఇస్మాయేల్? యిదీసహజమే ఆయనబోధించిన గురుపాఠం యింకాపూర్తిగా సరిపోలేదు సభ్యప్రపంచంలో

ప్రజాస్వామ్యంపేర వచ్చి బురఖాలతో నాట్యం
జేస్తావున్న–యీభూస్వామ్య నిరంకుశత్వం చేస్తూన్న
మర్దయం–దుర్నీతి–దురాచార్యాశలించే రోజులొచ్చినై
చెట్టునశించేరోజుల్లో ఉడుగాకుపిందెలు పుట్టుకొస్తాయిలే
తొందరపడకండి

రామ: వస్తాయి... మీ కుటుంబంమద్దతు చూచి కాదూ
పెళ్ళంతా నెత్తికెక్కింది. ఊరుకున్నానే!... రాని!.

అచ్చు: అంతనిరాదరణా! స్వామీ

రామ: కాదులే. పొగరుతీస్తా (ఇంతలో కబుర్ల గంగయ్య
వచ్చి సాహుకారు చేతికి కట్టఅందిస్తా)

క.గం: (చెవిలో) వచ్చారుబాబూ! అగట్టుకింమన్నారు.

రామ: పైనబడి కొట్టొచ్చేట్టున్నారోయ్! ఊరిరమ్మను (క.గం
వెళ్ళును) (చెవిలో) ఒరేయ్! వీడొక్కడే ఊ...

పోవును రక్తపాతం అందరూ ఆవేశం ఒకడు రామా
నందానికి వారంటు చూపిస్తాడు)

భూ సేనలీడరు: రామయ్యబాబూ ఇంత మురధికారంరాజ్యం చేసే రావణరాజ్యం కాదిది. ఇది ప్రజాయుగం కోఆప రేటిక్ కామన్ వెల్తుతో భూమిసాగుచేసే విధానం మన ప్రభుత్వవిధానమే మాభూసేన సంఘమే దీన్ని మోదించి ప్రచారంచేసింది. ఇవిగో మూబ్యాడ్జిలు ప్రెసిడెంటు ప్రసాదుగారే దీనిసవ్యం సహాయకత్వం

ఇన్స్పెక్టరు: నాదితో పాటు నీకూ జైలు ప్రాప్తిస్తుందిలే. అర్థంలే

భూ॥లీ: కానచ్చు మహాత్ముని ఆశయమైన రామరాజ్యాన్ని మరపించు కర్షకరాజ్యాన్ని సృష్టించుటే మా ఆశయం ఏమైనా చేయండి. రైతుసోదరులారా! పారిపోకండి మీరేం అన్యాయం చేయడంలేదు. కష్టపడుతున్నారు పండిస్తున్నారు పంచియిస్తున్నారు

జగం: (ఉద్రేకం) సోదరులారా! యిది న్యాయబద్ధం మీరేమి భయపడకండి. నాన్నా ఇదంతా అక్రమం మన్నించండి పండించుకోనియ్యండి (అని గడ్డం-చేయీ_పుచ్చుకొని కళ్ళకద్దుకొంటాడు రామయ్య విదలించును) నేను వ్రాసియిచ్చిందే యిదంతా? కాకుంటే నావంతు పంచండి.

రామ: (గంభీరంగా) ఊ…… (సైగచేయును)

ఇన్స్పె: ఏమయ్యా? రామానందం? యింత అశాంతేమిటి?

రామా: ఏముందిబాబూ? ఇచ్చింది కొడుకు. చేసేవాళ్ళం మేము. అన్యాయంమాదికాదు వారే యీఅక్రమానికి పాల్పడ్డారు పండిస్తూ ఉన్నాం, యీస్తూవున్నాం తప్పేముంది.

ఇన్స్పె: ఇంతమందినిల్లాచేర్చి సంక్షోభానికి దారితీయడం తప్పుగాదూ? పెద్దవారినిల్లా ఎదిరించి మీరంతా ఆయన్ని బెదిరించడం సాహసంకాదూ? ఆయన రిపోర్టుదాకా ఎందుకు రావాలి చదువుకున్న వాడివి సక్రమంగా వ్యవహరించు

రామా: (ఇస్మాయిల్ గాయాలు చూపిస్తూ) ఇదంతా సక్రమమే దుర్మార్గం-క్రౌర్యం పేదవాళ్ళమీద చూపించడం చాలా సన్మార్గమే

ఇన్స్పె: నాయెదుట ఇంతగా మాట్లాడుతూవున్న నిన్ని ప్రదేశంలో ఉంచితే యీమూర్తిరామయ్యగారి యింటికే నిప్పంటిస్తారు. నిన్నరెస్టుచేసి రిమాండులో వుంచి కేసు దర్యాప్తుచేస్తేగాని రంగంతాబయటపడదు ఏయ్… త్రీనాట్…ఫోర్! ఊ……సంకెళ్ళు తగిలించు

(సంకెలలు)

రామా: ఎందుకూ?

ఇన్స్పె: అదంతా కోర్టులో—

రామా: ఉపాలంజేసికొనే హక్కుంది నాకు

ఇన్స్పె: ఎవరిచ్చారా హక్కు—

రామా. ప్రభుత్వమే

ఇన్స్పె: ఎల్లా?—

రామా: కౌలుదారీ రక్షణచట్టాన్నమలులో పెడుతున్న శ్రీరాజాజీ కీవిషయం దుర్మార్గం—తెలిస్తే ఊరుకోంటారా!

ఇన్స్పె: ముందు పెత్తనమంతా నీవే పైనవేసికొనేట్టున్నావు శాసనమంటూ ఒకటి అమల్లోకివస్తే-తర్వాత ఆలోజించొచ్చు

రామా: అయినా — ఇప్పుడు చేస్తూన్న అన్యాయంమాత్రమేముంది

ఇన్స్పె; దీన్నంతా ఏమంటారో?

రామా: ఇదంతా వ్యవసాయం

ఇన్స్పె: ఎవరి భూములో—?

రామా: జగమిచ్చిన భూమిలో పండిస్తూన్నాం

ఇన్స్పె: మైనారిటీ వెళ్ళని కుజ్జువాడికళ్ళుకప్పి మోసానికి తయ్యారా పాల్పడ్డారా!

జగం: మోసమేమికాదు ఇది నా తాతగారు మా అమ్మకు యిచ్చినభూమి. దీనిలో సర్వాధికారాలు నావే ఒకరి పెత్తనం లేదు.

ఇన్స్పె; అబ్బాయీ! మేనేజిమెంటు చేస్తున్నా మీ తండ్రి బాధ్యుడుగాని నీ కేమి బాధ్యత లేదు.

జగం; మీరిల్లా జోక్యం కలుగజేసికోవటం దుర్మార్గం

ఇన్స్పె; అబ్బాయీ! బాల నాయకత్వం బహా నాయకత్వం పనికిరాదు. ఏయ్ త్రి... ...నాట్ ఫోర్? రామూనాం దాన్ని అరెష్టుచేసి స్టేషనుకు తీసికొని వెళ్ళవోయ్ (పోలీసువచ్చును)

పద్యం

బక్క—చిక్కిన డొక్కల నొక్క—నాట
నేని గడుపారభుజయింప—లేని వెట్టి
చాకిరికిసం కెలల గూడ—జంటగూర్చి
వారికు జేతికింగట్టు—బాటునిడిరి॥

రామా; (అందర్నీ కన్నీరుతో చూచి) నాకై మీరు విచారించకుడు అమ్మా ఏడువకు నాన్నకు నాస్థితి చెప్ప...నాన్నా

విశాల; అన్నా! ఇల్లాచూడు మేమేంచేయాలి(ఏడ్పు)

రామా; ఏంచేస్తామమ్మా!

విశాల: నీవల్లా జైలుకువెళ్ళితే నేనొక్క—దాన్నీ నాన్ననెలా సాకాలి?

రామా: (చూచి) సాకేదేముందమ్మా? నా...న్న...మన... మధ్య......నే... ఉంటాడుగా?......(కన్నీరు)

విశాల: (చూచి) .........నా.......అన్నా...? నా... అన్నా (ఏడ్పు)

రామా; అమ్మా! ఇదంతాదుర్విపాకం. ఏంచేస్తాం ఊరుకో (ఓదార్చును)

పద్యం

ఇంత ఘటనలకావంత—వంత గుంద
కమ్మ? కష్టాలకడలకు — మమ్మ! తోటి
రైతులోకమ్మె అండగా — బ్రతుకుదీర్చ
రామరాజ్యమ్ము సృజియింప — అండు? తల్లి? ॥—

(లోన కలలకం—నాగయ్య ఆర్తనాదంవినిపిస్తుంది దుఃఖ బావులైవున్న రైతులూ—విశాలా—అటుమళ్ళుదురు)

రామా; అమ్మా నాయనలారా నాకీచెరసాల కష్టమేమియూ లేదు ఇవి సంకెళ్ళుకావు

సంకెలలమింక గాఢదాస్యదా శాలగోరి!
చెఱకు రండాత్మవిద్రోహ-సీమలోన!
కునుకులు రైతాంగములకోడ-సమత లేసి!
సంఘముం జేల్పరాకంచు-సారథులయి!!

[పోలీసులు లాగివేయుదురు]

"ఒరేయ్, గంగన్నా! పుల్లన్నా! ఎంతచేశారురా!
నాతోటిరైతుల్ని—నాబిడ్డల్ని-చూడనీరట్రా?"

(రక్తసిక్తులై బల్లెపుపోటులూ - కఱ్ఱ దెబ్బలతోనున్న నాగయ్యను రంగంపైకితీసుకొచ్చి పరుండబెట్టి-అతని తలరంగ న్నకాలుపైనుంచు కొనును.)

నాగ: అమ్మా...ఇ...స్మా...యే...ల్! మిమ్మల్ని నరకం లోనిరాశ్రియంగ వదలివేయడమేనా?—

ఇస్మా: భత్కి—హుంటే బల్లానికూ తినోచ్చు నయంకా సీండి మాటాడకండి

నాగ; పిచ్చివాడా! ఈకసాయి అంగట్లోనుండి బయటపడడం కల్ల నాయినా! హింసతో కాలుష్యమైపోయిన యీ

కఠోర సంఘంలో కలకాలం బ్రతకడంకూడా కష్టమే తమ్ముడూ! అమ్మా! ఏఅండదండా లేని-నిన్నెవరికప్ప గించాలి? నాయాశలన్ని అడియాస లేనా?

జగం: మామయ్యా! అన్యాయం తాండవిస్తోంది దౌర్జన్యం అన్యాయం—ఈ ప్రజాసామ్యాన్ని – సరియైన దృష్టితో ప్రజాసామన్యానికి అందించడానికి అహర్నిశలూ శ్రమించి – నేను-విశాలా – మీఆశయాన్ని పూర్తి చేస్తాం (రక్తాన్ని బొట్టుపెట్టుకొని) ఈ రక్తతిలకమే దీక్షా తిలకం.

నాగ; అమ్మా! జగం బావే నీతోడునీడ ఇక మీయిద్దరు ఆదర్శంగా కాలం వెళ్ళబుచ్చండి.

జగం; విధిగా సర్వసమ్మతంగా (విశాల చేయిపుచ్చుకొనును)

నాగ; ఇక నాకుశాంతే – విశ్రాంతి లభించింది నాయనా—? రామూ—! కాస్సిని మంచినీళ్ళియి?

ఇస్మా; ఏనీళ్ళయిన అన్నీ అమ్మాయే అని చెప్పాడు బాబూ?

నాగ; అ—మ్మా— —?

విశాల; ఏంనాన్నా—?

నాగ; అ—మ్మా—అబ్బాయియక్కడ లేడా?

విశాల; ఈపాటికి జైల్లో వుంటాడు నాన్నా—? (ఏడ్చు)

నాగ: అ—దీ—నా—? ఇక నీకు తోడెవరుశి కాసిని మంచి నీళ్ళమ్మా—?

# పైడిగడ్డ

## పంచమదృశ్యం

[రామయ్యగారి యిల్లు ముందువరండా డ్రాయరూ మంచము—పడకకుర్చీ ఉంటుంది. గోడకు పిస్టలు—దస్తావేజుల కట్టా—తాళంచెవుల గుత్తి—మేకుకు వ్రేలాడుతుంటై డ్రాయరుపై ఏమో గ్లాసులూ "పాయిజన్" అని వ్రాసివున్న సీసా ఒకటి పెట్టి ఉంటై పడక కుర్చీలో కూర్చున్న రామయ్య ఎదురుగా గోడకున్న రక్త సిక్త మహాత్ముని బొమ్మ తదేక ధ్యానంతో చూస్తూ కన్నీరు కారుస్తూండును)

(కబుర్ల రంగియ్య వచ్చుచుండును)

రామా: ఇక చెయ్యలేం అనవసరం యీ వ్యామోహం పైగా ఇంతేనా

క.రం: అంతకాకుంటే ఇంకేముంటుంది బాబూ! చేతుల్లో కట్టి ఇచ్చినట్లుంది

రామ: ఏమిటా?

క.రం: పొలాలు.

రామ: చెయ్యలేక పోయావు వెధవ?

క.గం. అధికోత్పత్తికి ఫారానికే ప్రథమ బహుమానం

రామ: పనీ-పాటా-ఉంటేగా ఇచ్చే వాళ్ళవి? ఎవరిది భూమి? ఎవరికివ్వాలి? వొంగ ముండాకొడుకులు అందరూ అంతే

క,గం: పండించింది వాళ్ళు - ఇచ్చారు—

రామ: వాళ్ళ సొంతాలు. లేవరు కాదట్రా?—

క.గం: ఇంకేం లేస్తారు బాబూ! ఆ రామానందాన్ని కూడా వదిలేశారుట

రామ: ఏం?

క.గం; వాడేమీ తప్పు చేయలేదంట

రామ: లేదూ?—సరే—మనవాడేమైనట్టు? వచ్చేనా?

క.గం: చెప్పింది విన్నారు కాదు వాళ్ళతోనే కలిసి, పనీ-పాటా చేసికొంటూ—

రామ; (భావ విప్లవం) ...అంతే... పనీ - పాటా - చేసికొంటాడూ......?...ఏం క...ర్మం...? రా...డా? ఒక్కసారైనా...ఇదంతా...నా...కోసమేనా...?

క.గం: ఏంచేస్తాం బాబూ

రామ: ఏంచేద్దాం వాడికర్మ—అయినా—గంగన్నా—వీడూ—నామీదే కత్తికట్టేడేరా?

క.గం: ఆయనేం చేస్తాడు బాబు!

రామ: ఏం చేసాడా? అల్కాజనంతో చేరి సంపాదించిన భూము లన్నీ - ధారాగతంచేసి వాళ్ళన్నామీాదుసికొలుపు తాడా!__ పీడుకోడు—కా? ఆగర్భ శత్రువు—రా!

క.గం: అదేమిటిబాబూ! రెండేళ్ళనుంచీ-ఇంటికివస్తూన్నాడా?

రామ: ఎవరు రావొద్దన్నారురా—?

రామ: నీవు నాబిడ్డవు నా చెప్పుచేతల్లో ఉండాలి

జగం; నీ కోపానికిది సమయంకాదు క్షమించండి నీచానికి పాల్పడ్డావు ఫలితాన్ననుభవిస్తావు నరరూప రాక్షసుడా!

క.గం; పెద్దబాబుగారేదో అదోధోరణిలో మాట్లాడేరు లెండి కోపించకండి!

రామ; మాట్లాడకు వెధవ పళ్ళుపీకిస్తా, వాణ్ణి వెళ్ళనీయకుండా ముందాగేట్లు వెయ్యవోయ్! కష్టపడ్డావుగాని—చావు

క.గం; కష్టపడగలిగితే మీరిలా అంటారా బాబూ! ఏంచేస్తారో, మీరే చేయండి నేనీఘోరం చూడలేను కన్నబిడ్డ తండ్రికంటే ఎక్కువైన విజ్ఞానం - వివేకం - వచ్చింది ఆయన్ని పట్టుకొని మీశాసనాన్ని రుద్దజూస్తే ఎల్లా మరి? చిన్నప్పట్నించి చిన్నబాబును నాచేతుల్లో పెంచాను మీతో బాటు నేనీకభస చేయనూలేను మీ నౌకరీలో ఉండనూలేను ఇక్కడికి రెండేళ్ళనుండీ అబ్బాయి ఒక్కనాడైనా యింటిలో ఉన్నాడా! ఎందువల్ల? మీవల్ల రాకరాక వచ్చినఅబ్బాయినిఈవరుసగా దుయ్యబడుతూంటే నాగుండెలు తరుక్కుపోతూన్నై మీ వెంటబడి రైతులరక్తాన్ని త్రాగనూలేను ఏమో లెండి కలో-గంజో-త్రాగి ఆరైతుల్తోపాటు నేనూ శ్రమిస్తే - కలకాలం సుఖించొచ్చు మీ నౌకరీలో వచ్చేప్పున్నెం-పురుషార్థం-రెండూలేవు బాబూ! ఇదిగో మీ చేతికఱ్ఱ కప్పించి తింటే ఒకరితో మాటలు పడవలసిన పనిలేదు సెలవు బాబూ! (కఱ్ఱగోడనుంచును)